# ఆంధ్రపత్రిక



The Andhra Patrika, Madras. | Regd. No. M. 1118 Vol. 36 No 222 TUESDAY 15th NOVEMBER 1949 వెల ఒకఅణా | Founder: K. NageswaraRao

# ఆంధ్రజిల్లాలకు వరదలు, తుపాన్‌వల్ల కలిగిన అపారనష్టం

## ఆంధ్రకోస్తాజిల్లాలలో తుపాన్ బాధితులకు గవర్నర్ల సానుభూతి

## సహాయనిధి సేకరణ ప్రారంభించినట్లు రాష్ట్రకాంగ్రెసుఅధ్యక్షునికి ప్రత్యేకసందేశాలు

విజయవాడ, నవంబరు 14: ఆంధ్రకోస్తాజిల్లాలకు తుపానువల్ల ఇటీవల వాటిల్లిన విపత్తుకు విషాదము, బాధితులకు సానుభూతి వెల్లడించుచు, ఆయారాష్ట్రములలో తాము సహాయనిధి సేకరణ ప్రారంభించినట్లు తూర్పుపంజాబు గవర్నరు సర్ చందూలాల్ త్రివేదీ, అస్సాం గవర్నరు శ్రీ ప్రకాశ, బీహారు గవర్నరు ఎం. ఎస్. ఆనే, ఒరిస్సా గవర్నరు ఆసఫ్ ఆలీగార్లు ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు అధ్యక్షుడు ఎన్. జి. రంగాగారికి సందేశము లంపిరి.

### చందులాల్ త్రివేది సందేశం

విజయవాడ, నవంబరు 12: ఆంధ్ర దేశ ప్రజలు ఇటీవల తుపాను కారణంగా లోనైన యాతనలకు, నష్టమునకు తూర్పుపంజాబు ప్రభుత్వము, ప్రజలతరఫున సానుభూతి తెలుపుతూ రాష్ట్రగవర్నరు సర్ చందూలాల్ త్రివేది ఆం. రా. కాం. అధ్యక్షుడు ఎన్. జి. రంగా గారికి ఒక తంతిసందేశ మిచ్చారు. తమరాష్ట్రం భారత విభజన మూలంగా చెప్పరాని బాధలను ఇంకా అనుభవిస్తున్నప్పటికీ, తమకు చేతనైనంతగా సహాయం చేయవలెననే ఉద్దేశ్యంతో తుపాను బాధితుల సహాయ నిధిని ప్రారంభిస్తున్నామనికూడా త్రివేది తెలియపరిచారు.

త్రివేదిగారిట్లు వ్రాసిరి: ఇటీవల తుపాను సందర్భంలో అపారనష్టాలకు గురి అయిన ఆంధ్ర ప్రజానీకానికి తూర్పు పంజాబు ప్రజలతరఫున ప్రభుత్వం తరఫున సానుభూతి తెలుపుతున్నాను. మారాష్ట్రం ఇంకా దేశవిభజన, తదనంతర పరిస్థితులవల్ల కలిగిన విషాదస్థితిలోనే ఉన్నందువల్ల, ఆంధ్రుల సహాయార్థం ఇవ్వగల విరాళాలు తక్కువే అయినా సహాయనిధి ఏర్పరుస్తున్నాను.

### అస్సాం గవర్నరు విరాళం

ఆంధ్రతీరానికి తుపానువల్ల కలిగిన ఘోరవిపత్తుకు తానెంతో చింతిస్తున్నాననీ, తానీ సందర్భంలో మద్రాసు గవర్నరుకు కొంత విరాళం పంపించాననీ అస్సాం గవర్నరు శ్రీ ప్రకాశ ఎన్. జి. రంగాగారికి లేఖ వ్రాశారు.

అస్సాం గవర్నరు శ్రీ ప్రకాశగారు ఇట్లు వ్రాసిరి: ఆంధ్ర కోస్తాలో తుపాను వరదలవల్ల కలిగిన విధ్వంస వార్తలు విని చాలా సంతాపపడ్డాను. మీ గవర్నరు గారికి అప్పుడే నా విరాళం పంపుకొని వున్నాను.

### బీహారు

బీహారు గవర్నర్ ఎం. ఎస్. ఆనే గారిట్లు వ్రాసిరి: తుపాను బాధితులకు నా హృదయపూర్వక సానుభూతిని ఈ విపత్క...

(3-వ పేజీ చూడుడు)

### "ప్రభుత్వంపై ప్రజలకు విశ్వాసం ఉండాలి"

#### మౌలానా ఆజాద్ హెచ్చరిక

సిమ్లా, నవంబరు 13: ఇండియా ప్రభుత్వవిద్యాశాఖామంత్రియగు మౌలానా అబుల్ కలాం ఆజాదుగారికి సిమ్లాకు 57 మైళ్లదూరములోనున్న కాసౌలీలో ఆరోగ్యప్రదమైన పట్టణపు మ్యునిసిపలు బోర్డు వైసుప్రెసిడెంటు అగు గోవర్ధనలాలు గారున్నూ, ఇచటి కాంగ్రెసు నాయకుడగు డా|| గంగారాంగారున్నూ స్వాగత పత్రమును సమర్పించిరి. ఇండియా పాకిస్తానులు విభాగమైనప్పుడు యీ కాసౌలి పట్టణములో కించిత్తయినను మతకలహములు జరుగలేదు. ఒక్క మహమ్మదీయుడైనను దెబ్బతినలేదు. ఇచట మౌలానా ఆజాదుగారు నిన్న ఉపన్యసించుచు ఇట్లు చెప్పిరి. ప్రజలు ఓర్పువహించి ప్రభుత్వముయెడల విశ్వాసముతో ఉండవలెను. ప్రభుత్వముయెడల నమ్మకముతో ప్రభుత్వమునకు తోడ్పడి పనిచేయవలెను.

ఇప్పుడు దేశంలో ప్రబలియున్న ఆర్థిక దుస్థితికి ప్రభుత్వమును నిందించుట తగదు. గత ప్రపంచ సంగ్రామ ఫలితంగా యీ ఆర్థిక పరిస్థితులు ఏర్పడినవి. ప్రపంచంలోని అన్ని రాజ్యాలు కష్టస్థితిలో నే ఉన్నవి. భారతదేశము కూడా యితర రాజ్యాలతోబాటు ఆర్థిక దుస్థితికి పాల్పడినది. ఈ దుస్థితిని తొలగించుటకు గవర్నమెంటు చేయదగినదంతయూ చేయుచున్నారు. గవర్నమెంటుకు కొంతి వ్యవధి యివ్వవలెను. అనేక వ్యవహార శాఖలలో ఉద్యోగుల జీతములను తగ్గించి ఖర్చు తగ్గించవలెను. ప్రజలు తోడ్పడినట్లయితే బ్లాకు మార్కెటు వ్యాపారస్థులను అరికట్టవచ్చును. బ్లాకుమార్కెటు వ్యాపారం ప్రజలు ప్రోత్సహించరాదు.

సిమ్లాలోని సనావారు వద్దనున్న లారెన్సుస్కూలు విద్యార్థుల సమావేశములో మౌలానా ఆజాదుగారు ఉపన్యసించుచు ఇట్లు చెప్పిరి.

కష్టపడి చదువుకోగల విద్యార్థులు కొందరు విద్యాభ్యాసమున కయ్యెడి ఖర్చును భరింపజాలక పోవచ్చును. అట్టివారికి ఉచితవేతన సహాయము చేయబడవలెను. ఈ విద్యాశాలలో యివ్వబడే మిలిటరీ శిక్షణ యథాప్రకారము సాగుచునే యుండవలెను. ఈ విద్యాశాలలో 147 మంది విద్యార్థులు కలరు.

### రాజకీయ సంఘంలో విషిన్‌స్కి తీర్మానం

#### బ్రిటన్, అమెరికాలు యుద్ధాన్ని కాంక్షిస్తున్నవని ఆరోపణ

లేక్ సక్సెస్, నవంబర్ 14: సోవియట్ రష్యా విదేశాంగమంత్రి ఆంద్రీ విషిన్‌స్కి ప్రతిపాదించిన ఒక "శాంతి తీర్మానం" మీద ఐక్యరాజ్య సమితి రాజకీయ సంఘంలో ఈ వేళ చర్చ ప్రారంభం అవుతుంది. ఈ తీర్మానంలో 3 భాగాలు ఉంటవనీ, వాటి సారాంశం ఈ క్రింది విధంగా ఉంటుందనీ తెలుస్తున్నది:

(1) బ్రిటన్ అమెరికాలు ప్రదర్శిస్తున్న యుద్ధ కాంక్షను గర్హించినది.

(2) ఆటంబాంబులను నిషేధించడం.

(3) అగ్రరాజ్య పంచకం (బ్రిటన్, ఫ్రాన్సు, రష్యా, చైనా, అమెరికాలు) శాంతి ఒడంబడిక ఒకటి కుదుర్చుకోవాలి.

ఆటంబాంబులను నిషేధిస్తూ ఒక ఒడంబడిక, అణుశక్తి ఉత్పాదనపై పరిమితమైన కంట్రోలును విధిస్తూ వేరొక ఒడంబడిక విడివిడిగా వ్రాసుకోవాలని ఆంద్రీ విషిన్‌స్కి రాజకీయ సంఘంలో ప్రతిపాదన చేయుగలడు పాశ్చాత్యరాజ్యాలు ఈ రెండు ప్రతిపాదనలను తిరస్కరించునని విశ్వసనీయంగా తెలియవచ్చింది.

### సింకియాంగ్‌లోని చైనా సైన్యాధికార్లు

#### పాకిస్తాన్‌కు 12 మంది రాక

పెషావర్, నవంబరు 13: చైనా దూర పశ్చిమరాష్ట్రమైన సింకియాంగ్ రాష్ట్రంలోని 12 గురు జాతీయ చైనా సైనికాధికారులు ఆ రాష్ట్రం కమ్యూనిస్టుల వశమైనతరవాత పాకిస్థాన్ పారిపోయారని తెలుస్తున్నది. వీరు గిల్గిట్ ద్వారా హిమావృతమైన లోయలలోనుండి ప్రయాణం చేశారు. వీరిలో కొంతమంది సైన్యాధికారులు కూడా వున్నారు.

## 11 లక్షల ఎకరాల పంట నాశనం

## 835 మంది మరణం: 34,747 పశువుల నష్టం

### మొత్తం 3 లక్షల నివాసాల విధ్వంసం

చెన్నపట్నం, నవంబరు 14: ఆంధ్ర కోస్తా జిల్లాలలో అక్టోబరు మాసంలో వచ్చిన తుపానువల్ల మొత్తం 778 మంది ప్రజలు 30,210 పశువులు మరణించెననీ, 10,33,100 ఎకరాల పైరు పాడైపోయెననీ రెవిన్యూమంత్రి హాంవార్డ్ సీతారామరెడ్డిగారు నేడు లెజిస్లేటివ్ కౌన్సిలులోనూ, అసెంబ్లీలోనూ తుపాను నష్టంగురించి చర్చను ఉపక్రమించుచు వెల్లడించిన వివరాలవల్ల తెలుస్తున్నది.

సెప్టెంబర్లో వచ్చిన వరదలవల్ల గుంటూరు, కర్నూలు మొదలయిన జిల్లాలలో 57 గురు మనుష్యులు, 4537 పశువులు మరణించెనని, 94,577 ఎకరాల పైర్లు పాడైపోయెననికూడ మంత్రిగారు వెల్లడించిరి.

తుపాను, వరదలవల్ల ఆంధ్రజిల్లాల మొత్తంమీద 3 లక్షల 836 నివాసాలు దెబ్బతిన్నట్లుకూడా మంత్రిగారు వివరించిరి.

### నష్టం వివరాలు

#### ప్రభుత్వ ప్రకటన

మదరాసు, నవంబరు 14: ఆంధ్రదేశము వరదలీ తుపానునష్ట వివరములను సహాయకార్యములను దెల్పు యీ దిగువ ప్రకటన మదరాసు కౌన్సిలు సభ్యులకు నేడుదయం అందజేయబడెను.

#### విశాఖపట్నము

సెప్టెంబరు వరదలవలన రోడ్లకుగాను, పంటకుగాను అట్టే నష్టం కలుగలేదు. తాడి రైల్వేస్టేషను చేరువ రైలుమార్గానికి గండిపడి, 8000 ఎకరాలపంట నీట మునిగినది. గతవారం తుపానువలన శ్రీకాకుళం, పార్వతీపురం, విశాఖపట్నం, నర్సాపురాడి విజయనగరం చాల నష్టం కలిగినది. శారదా, వంశధార నాగావళి నదులు మూడును పొంగి, 7000 ఎకరాల పల్లపుభూములను ముంచివేసినవి. 15,000 యిండ్లకు నష్టం కలిగెను. 60 పెద్ద చెరువులు, 800 చిన్న ఇరిగేషను చెరువుల గట్లు తెగినవి. ఏడ్గురు మనుష్యులు చనిపోయిరి. 70 పశువులు, 500 గొర్రెలు మేకలు చనిపోయినవి. 84531 ఎకరాల పల్లంపంట, 4648 మెరకపంటకు నష్టం వచ్చింది.

నష్టపోయిన కుటుంబాలకు కొద్ది రోజులు అన్నదానంచేసి, బియ్యం యిచ్చిరి విత్తనాలు, ఎరువులు రయితులకు యిచ్చుటకు ఏర్పాటులు చేయబడినవి. గుడిసెలు వేసుకొనుటకు ద్రవ్య సహాయం చేయబడెను.

#### తూర్పు గోదావరి

56 గురి మరణం 210,188 ఎకరాల నష్టం

తూర్పు గోదావరిజిల్లాలో సెప్టెంబరు వరదలవలన తుని-పిఠాపురం రోడ్డు వరదలవలన చెడిపోయినది. జలాధారాలుకూడ కొద్దిగా చెడినవి.

తుపానువలన కలిగిన నష్టాలగూర్చి కలక్టరు పంపిన యిటీవల నివేదికలందు యిట్లు గలవు:-జననష్టం 56, పసువులు 4891, ఇండ్లు 2061 పెంకుటిళ్లు, 57,888 పూరిండ్లు, వరిపైరు నష్టం 210188 ఎకరాలు. కొబ్బరితోటలు 42842 ఎకరాలు. అరటి తోటలు 2000 ఎ. చెరకు 4000. (ఈ రెంకు రామచంద్రపురం తాలూకాలో) మైనరు ఇరిగేషను చెరువులు 95 మేజరు ఇరిగేషను చెరువు 1 చెడినవి.

నష్టం వివరాలు తాలూకా వారిగా యిట్లు గలవు.

రాజోలు- పంటలు 88200 ఎ. కొబ్బరి తోట 18700 ఎ. ఇండ్లు 2000, గుడిసెలు 15,000 పసువులు 1024.

అమలాపురం: వరి-78700 ఎ. కొబ్బరి 25,500. గుడిసెలు 24800. పసువులు-2779.

కాకినాడ తా: వరి-30,000 ఎ. గుడిసెలు 100. ప్రాణహాని-56. పసువులు 100. గొర్రెలు 100.

పెద్దాపురం: వరి-1000 ఎ. చెరువులు-66.

రామచంద్రపురం: కొబ్బరి-500 ఎ. చెరకు-6400 ఎ చెరువులు 18.

రాజమండ్రి: పొగాకు-1000 ఎ. కొద్ది చెరువులు. 8 పసువులు.

తుని: గుడిసెలు-500.

కొత్తపేట: పసువులు 419.

కాకినాడ, పిఠాపురం, రామచంద్రపురం తాలూకాలందు రోడ్లకు నంతేనలకు నష్టం కలిగెను. హైవేస్ శాఖవారు మరమ్మత్తులు చేయుచున్నారు. రైల్వే లైనుకూడ కాకినాడ సామర్లకోట మధ్యను, మెయినులైనుకూడ చెడింది. టెలిఫోను, టెలిగ్రాఫ్ సంబంధాలు తెగినవి, కాని తర్వాత సరిచేయబడినవి. ఇండ్లుపోయిన వారిని భద్రమైన స్థలాలకు గొంపోయి భోజనాలు పెట్టిరి. తాలూకా, నగర, గ్రామసహాయ సంఘాలు స్థాపించబడినవి. తునిలో బాధితులకు రూ 400/- ఖర్చు చేసి ఆర్. డి. ఓ. గారు భోజనాలు పెట్టిరి. పిఠాపురంలో హరిజనులకు జిలాకలెక్టరు రూ 500/ ఖర్చుచేసి సహాయంచేసెను. పాఠశాలలు మున్నగుసంస్థల భవనాలు పడిపోయినవి. అనేక యిండ్లకప్పులు ఎగిరిపోయినవి. పూరిండ్లన్ని చెడినవి. రామచంద్రపురం తాలూకాలో 120 పడవలు చెడినవి. ఒక స్టీమరు మునిగిపోయినది.

#### ప. గోదావరి

80% వంతు పంటలు తోటలకు నష్టం

సెప్టెంబర్ వరదలవలన, కొల్లేరు వరద 9000 ఎకరాల పంటకు నష్టం వచ్చి, కొన్ని కుటుంబాల యిండ్లు పోయినవి.

మొన్నటి తుఫానువలన వరిపంట నష్టం వివరాలు యిట్లున్నవి: 525,000 ఎకరాల మొత్తం వరిపంటలో 29000 ఎకరాలు బసంగిపంట. ఇది సగం చెడినట్లు అంచనా వేయబడెను. 315,000 అక్కట్లు నాటిన పొలాలలో నూటికి 25 లేక 30 వంతు నష్టపడినవి. కిచిడీ యున్నగు సన్నరకాలు 180,000 ఎకరాలలో నూటికి 60 నుండి 70 వరకు నష్టం కలిగింది.

కొబ్బరి తోటల నష్టం నర్సాపురం తాలూకాలో 80% యితరచోట్ల 25% సేరమయిన నష్టం కలిగింది.

తాలూకావారిగ నష్టం:

తాడేపల్లిగూడెం: పల్లంపంట 83917 ఎ., మెరక-27932 ఎ. జననష్టం 1, పసువులు మేకలు-386. ఇండ్లు, గుడిసెలు 14625.

కొవ్వూరు:—పల్లం-18868, మెరక-18544 ఎ. చెరువులు - 18. జనం-1. పసువులు 1192. ఇండ్లు 1652.

(4-వ పేజీ తరువాయి)

## సాలుకు 10 లక్షల టన్నుల ధాన్యం అదనపు పంట

### ప్రపంచబ్యాంకు ఋణంవల్ల సాధ్యపడగలదని ప్రభుత్వోద్యోగి విశ్వాసం

న్యూఢిల్లీ, నవంబరు 13: ఈ మధ్యన ప్రపంచ బ్యాంకు ఇండియాకు కోటి డాలర్ల ఋణం మంజూరు చేసింది. దీనివల్ల భారత దేశంలో ప్రతి సంవత్సరము 10 లక్షల టన్నుల ఆహారం అధికంగా ఉత్పత్తి కాగలదని తెలుస్తున్నది.

కేంద్ర ప్రభుత్వాధికారి ఈ విషయం ప్రసంగిస్తూ వచ్చే ఏడు సంవత్సరాలలోను భారతదేశంలో 30 లక్షల ఎకరాల బంజరు భూమి సాగుకు రాగలదనీ, ఆ పిమ్మట మరి ఒక లక్ష, 20 వేల భూమికూడా సాగుకిందకు రాగలదనీ అన్నారు.

ప్రపంచ బ్యాంకు అప్పువల్ల ఇండియాకు మరనాగళ్లు మొదలైన యంత్ర పరికరాలు సంపాదించడానికి వీలవుతుంది. ఇంకా కాలగు భిన్న ప్రాంతాలనుంచి మరికొన్ని యంత్ర పరికరాలు కొనడానికి కూడా వీలవుతుందని తెలుస్తున్నది. దీని కోసం 15 కోట్ల రూపాయలు ఖర్చవుతుంది. ఇది 7 సంవత్సరాలలో ఖర్చు పెడతారు. 1951 సంవత్సర ప్రారంభంలో ప్రపంచబ్యాంకు సహాయంవల్ల కొన్న 375 మరనాగళ్లు పనిచేస్తుంటాయి. వచ్చే అయిదు సంవత్సరాలలోను, సంవత్సరానికి 4 లక్షల 80 వేల ఎకరాల భూమి సాగుబడిలోనికి వస్తుంది. ఈ భూమివల్ల 1 లక్ష 60 వేల టన్నుల సాలవా ధాన్యం లభించగలదనికూడా తెలుస్తున్నది. ఈ ప్రణాళిక అంతా పూర్తి అయ్యేవరికి 10 లక్షల టన్నుల అధిక ధాన్యోత్పత్తి ప్రణాళిక పూర్తి అవుతుంది.

## హేగ్ సమావేశ ఫలితాలు హాలెండు ఇండొనీషియాలు రెంటికీ క్షేమకరం కాగలవని కమిషన్ విశ్వాసం

హేగ్, నవంబరు 13: ఐక్యరాజ్యసమితి ఇండొనీషియా కమీషన్ ఈ వేళ హేగ్ రౌండుటేబుల్ సమావేశ ఫలితాలను సమీక్షిస్తూ భద్రతా మండలికి ఒక నివేదికను సమర్పించెను.

ఇండొనీషియాకు నెదర్లాండ్సుకు ఈ సమావేశ ఫలితంగా ఏర్పడనున్న నూతన సంబంధాలు ఉభయుల యోగక్షేమాలకు లాభకారిగా ఉండగలవని కమీషన్ ఈ నివేదిలో అభిప్రాయం వెలిబుచ్చింది.

"హేగ్‌లో జరిగిన రాయబారాలు చాలా ఫలప్రదంగా పరిణమించినవని చెప్పడానికి కమీషన్ సంతసిస్తున్నది. ఈ సంవత్సరాంతంలోగా ఇండొనీషియా సంయుక్త రాష్ట్రాలకు సర్వతంత్ర స్వాతంత్ర్యాన్ని బేషరతుగా ఇవ్వడానికి డచ్చివారు అంగీకరించిరనీ, ఒడంబడికల తుది ముసాయిదాలపై నవంబరు 2 వ తేదీన సంతకాలు జరిగినవనీ కమీషన్ వ్రాసింది.

ఇండొనీషియా నెదర్లాండ్సు ఆన్యోన్యం సహకరించుకొనే పద్ధతులు తీరలోనే గాగలవని తాము లోగడ పంపిన ఒక నివేదికలో వ్రాసియుంటిమనీ, ఈ ఆశ ఇప్పుడు పూర్తిగా సఫలమైందనీ, ఇండొనీషియా కమీషన్ వ్యాఖ్యానించింది.

సమావేశంలో తాము వహించిన పాత్ర గురించి ప్రస్తావిస్తూ కమీషన్ ఇలా వ్రాసింది: "సభముగియవలసిన రోజు దగ్గరపడుతున్న కొద్దీ, ఉభయపక్షాలూ శేషించిన సమస్యల పరిష్కారం కోసం కమీషన్ మధ్యవర్తిత్వాన్ని అర్థించడం మొదలుపెట్టినవి. కమీషన్ 12 సమస్యల మీద రాజీ ప్రతిపాదనలుచేసి ఉభయపక్షాల చేత వాటిని స్వీకరింపజేసింది. కమీషన్

(8వ పేజీచూడుడు)

## ఫ్రాన్సు-జర్మనీల చిరకాలశత్రుత్వపరిష్కారానికి పశ్చిమరాజ్యాల యత్నం

### బ్రిటిష్ విదేశాంగమంత్రి బెవిన్ ప్రకటన

లండన్, నవంబరు 13: జర్మనీ విషయమై పారిస్‌లో పశ్చిమరాజ్య విదేశాంగ మంత్రులు జరిపిన సంప్రదింపుల విషయమై బ్రిటిష్ విదేశాంగమంత్రి బెవిన్ నేడు ప్రస్తావిస్తూ "ఈ సంప్రదింపులవల్ల తరతరాలుగా ఫ్రెంచివారికీ, జర్మనులకూ మధ్య నడుస్తున్న వైరాన్ని పోగొట్టటం సాధ్యపడవచ్చును." అని అన్నాడు.

"విదేశాంగమంత్రులు జరిపిన సంప్రదింపులకు సంబంధించిన వివరాలమీద జర్మనీలోని మూడు పశ్చిమరాజ్యాల హైకమిషనరు ప్రయత్నిస్తారు." అని బెవిన్ వెల్లడించాడు.

### వ్యాపారబాకీల చెల్లింపు

"బ్రిటన్ విదేశవ్యాపారంలో ఇవ్వవలసిన బాకీలను చెల్లించే విషయమై అమెరికా సహాకారంవల్ల ఈ వివాదంలో నే ఒకమార్గం కనిపించేట్లు తోస్తున్నది. అందరికీ అప్పులు పెట్టగలశక్తి ఉన్నది కనుక అమెరికా ఇతర దేశాల సరుకులను కూడా కొనటానికి సిద్ధపడాలి. ఈ బాకీల చెల్లింపుసమస్య శాశ్వతంగా పరిష్కారం కావాలంటే అమెరికా అప్పు లివ్వటం వల్ల లాభమేమీలేదనీ, ఆదేశాల సరుకులనే తప్పనిసరిగా అమెరికా కొనవలసి ఉన్నదనీ ప్రెసిడెంట్ ట్రూమనూ, ఆయన ప్రభుత్వమూ గుర్తించినవని అమెరికా విదేశాంగమంత్రి ఎచిసన్ పారిస్ సంప్రదింపుల సందర్భంలో వెల్లడించాడు." అని బెవిన్ వివరించాడు.

## 'హక్కుల కొరకు శాంతియుతంగా పోరాడవలెను'

### వ్యవసాయ కూలీలకు ప్రముఖుల హితోక్తులు

వెంకటగిరి తాలూకా హరిజన మహాసభ

వెంకటగిరి, నవంబరు 5: ఈ తాలూకా వ్యవసాయకూలీల మహాసభ రోటంచేను గ్రామములో నిక్కియేసుగ పట్టాభిరామిరెడ్డిగారి అధ్యక్షతన జరిగినది. వడియార కాయప్పగారు ప్రారంభోత్సవము జరిపిరి. కె. మణిముఖం (యం. యల్. ఏ) గారిచే సభా కార్యక్రమము ప్రారంభమయ్యెను. కె. రామమ్మగారు ప్రార్థనచేసిరి. కె. వెంకటసుబ్బయ్యగారు పద్యములు చదివిరి. పి. వెంకటస్వామిరెడ్డి, పంట రంగయ్య, పి. గోవిందరెడ్డి, పి. రామకృష్ణయ్య, పి. సుబ్బరామయ్య, పి. నారాయణస్వామి గారలు, స్థానిక డిప్యూటి తాసిల్‌దారు ఎ. కృష్ణమాచారి, స్పెషల్ తాసిల్‌దారు అన్నదాత మార్కండేయులు, తాలూకా సప్లయి ఆఫీసరు యం. రంగయ్యశెట్టిగార్లు హరిజనసేవకులు, కాంగ్రెస్ సేవకులు, పలువురు సభకు హాజరైరి.

పట్టాభిరామిరెడ్డిగారు అధ్యక్షోపన్యాసంలో దేశస్థితిగతులు వివరించి 35 కోట్ల జనాభాకలిగి, అనేక ఇబ్బందులతో కూడిన దేశాన్ని ఒక్కగంటలో ఒక్కరోజులో చక్కచేయాలంటే సాధ్యముకాని పనిఅనీ, కావున కాంగ్రెసువారినీ, వారి ప్రభుత్వాలనూ నిందించరాదనీ, కొంతకాలము ఓపికతో ఉండాలనీ ప్రజలకు విజ్ఞప్తి చేసిరి.

తర్వాత గాంధిజీ హరిజనులకుచేసిన సేవను వివరించి అందువల్లనే హరిజనులకు ప్రస్తుత శక్తివచ్చినదనీ, గాన హరిజనులు కాంగ్రెస్‌నే బలపరచాలనీ, కమ్యూనిష్టు సోషలిస్టు ప్రచారానికి లోబడరాదనీ, భూకామందులు పేదప్రజలయెడల వారి హృదయములు మార్చుకొని దేశాభ్యుదయానికి సాయపడవలెనని కోరిరి.

కాయప్పగారు ప్రారంభోపన్యాసములో అస్పృశ్యులు హరిజను లెట్లయినదీ వివరించి, హరిజనులు విద్యాహీనులై వున్నందుననే అథోగతిలో యున్నారని ప్రతి హరిజనుడు, తమ బిడ్డలకు తప్పని సరిగా విద్య నేర్పించాలనీ, ఉద్బోధించిరి.

పిమ్మట పి. సుబ్బరామయ్యనాయుడుగారు గాంధీజీ నిర్మాణ కార్యక్రమమును గూర్చి, ప్రేమ, ఐక్యతలనుగూర్చియు, జీవిత ప్రాముఖ్యతనుగూర్చియు, కె. రుక్మిణమ్మగారు సంఘ అవశ్యకతనుగూర్చియు పి. వెంకటస్వామి రెడ్డిగారు వ్యవసాయ కూలీలు రైతుల ఐక్యతనుగూర్చియు, పి. గోవిందరెడ్డిగారు, త్రాగుడు, సారాయి కాపుడు, దొంగతనాలు, మొదలైన దుర్గుణాలు మానుకోవాలనీ, వి. సుందరరామిరెడ్డిగారు ఐక్యతనుగూర్చి జె. జనందరాజుగారు, కూలీల ఇబ్బందులనుగూర్చి పి. రామకృష్ణయ్యగారు క్రమశిక్షణ ఆవశ్యకతనుగురించి ఉపన్యసించిరి. వెల్పూరు కజ్జయ్య, పెద్దరైతులు హరిజనులను పెట్టు ఇబ్బందులనుగూర్చి విన్నవించెను. తర్వాత ఈ దిగువ తీర్మానములుచేసిరి. వ్యవసాయ కూలీలకు రోజుకు 6 గంటల పనియు, రొక్కము అయిన పురుషులకు ఒక్కరూపాయి, స్త్రీలకు ముప్పావలా, ధాన్యమైన పురుషులకు ఒకటిన్నరమంతే స్త్రీలకు ఒకమంతచొప్పున ఇవ్వవలెనని వ్యవసాయకూలీల అప్పులు పూర్తిగా రద్దుపరచవలెనని, ప్రభుత్వమువారు సప్లయిచేయు వ్యవసాయ పనిముట్లు, విత్తనములు, యెరువులు, వగైరాలు వ్యవసాయ కూలీలకు సక్రమముగా పంపకము జరుగు యేర్పాటులు చేయించవలెనని, కోరబడినది.

ఈ తాలూకాలో పెద్దరైతులు ఒకే భూమికు నాలుగు నాలుగు ముంతిరులకు, గూపాయల ముంతరుకు, సంవత్సరమునకు రెండుపర్యాయములు వసూలుచేయుచున్నారనీ, అందువలన పేదలగు వ్యవసాయ కూలీలు పడు కష్టములు చెప్పనలవికాదనీ, వీరికి పరపతి సహకారసంఘములద్వారా సహాయము చేయవలయునని కూడ కోరబడినది.

నెల్లూరుజిల్లా కలెక్టరు అర్. యస్. మలయప్పను, తాలూకా స్పెషల్ తాసిల్‌దారు అన్నదాత మార్కండేయులు గార్లు హరిజనులకు చేయుచున్న సేవను ప్రశంసించబడినది. పేదరైతులకు వ్యవసాయ బుణములు [illegible] ఇవ్వ కూడదని ప్రస్తుత చట్టమున్నదనీ, రైతు కోరిన బుణము అతని పెట్టిపంటలపనికిన్ని దాకే కలిపిన [illegible] మించి [illegible] నిగలవారికి, నిరాటంకముగా అప్పు ఇప్పించవలెనని కోరబడినది. హరిజనులకు పట్టణములలోగాని గ్రామాలలోగాని [illegible] గృహాలకు [illegible] కోరబడినది.

[illegible]

## అణుశక్తి అంతర్జాతీయ కంట్రోలు సమస్యపై ఇండియా తీర్మానం

### విమర్శకులకు సర్. బి. నరసింగరావు సమాధానం

లేక్‌సక్సెస్, నవంబరు 12: నేను ప్రత్యేక రాజకీయసమితిలో ఇండియా ప్రతినిధి సర్ బి నరసింగరావు, అణుశక్తి అంతర్జాతీయ కంట్రోలు సమస్యను అంతర్జాతీయ న్యాయమండలికి దాఖలు చేయాలన్న ఇండియా ప్రతిపాదనపై వచ్చిన విమర్శలకు సమాధానం చెప్పారు.

అణుశక్తి కంట్రోలు రాజకీయ సమస్య అనీ, అందులో న్యాయ శాస్త్రుల ప్రమేయం లేదనీ అన్న విమర్శకు సమాధానం చెబుతూ ఆయన, "ప్రతిపాదన సరిగా చూచినట్లయితే అందులో అంతర్జాతీయ న్యాయమండలివారు ఒక ప్రకటన తయారు చేయవలెనని ఉన్నది గాని ప్రకటన చేయవలెనని లేదు. ఈ ప్రకటన సర్వప్రతినిధి సభలో చర్చకు వచ్చినప్పుడు సభవారు తమ యిష్టం వచ్చినట్లు చేయవచ్చును," అన్నారు.

ఇండియా ప్రతిపాదన ఆదర్శయుక్తంగా ఉన్నదనీ, ప్రకటనల ద్వారా అణుశక్తి కంట్రోలు సమస్య పరిష్కారం కాదనీ, ఇట్టి ప్రకటనలు లేనిపోని ఆశలు కల్పించి అపకారం కూడా చేయవచ్చుననీ చేయబడిన విమర్శపై మాట్లాడుతూ ఆయన, ఇండియా తీర్మానం మూలంగా ఇతర సంస్థలు తమ పనులు కట్టిపెట్టవలసిన అవసరం లేదనీ, సాధ్యమైనంత త్వరలో అణుశక్తి కంట్రోలు అమలు జరపడానికి జరిగే చర్చలు జరుపవచ్చుననీ, అణుశక్తి కమిషను వారు లోగడచేసి ఉన్న కృషికి ఒక స్వరూపం ఇవ్వడమే ప్రకటన యొక్క ఆశయంగాని వారు ముందు చేయబోయే పనిని అడ్డగించడం ఎంతమాత్రమూ కాదనీ ఈ సమస్య పరిష్కారం కావాలంటే అపనికొన సాగాలనీ, ఇండియా తీర్మానమూ, ఫ్రాన్సు కెనడాల సంయుక్తతీర్మానమూ, యితర తీర్మానాలూ ఒకదానికొకటి అనుబంధించి ఉన్నవనీ, జరిగిన కృషికి అత్యంత అధికారయుతమైన స్వరూపం ఇవ్వడానికే ఇండియా ప్రతిపాదన జరిగిందని, అందుచేత ప్రకటనలవల్ల సమస్యలు పరిష్కారం కావనడం సరికాదనీ కేవల ప్రటనలవల్ల యుద్ధాలు నివారణ కావని అందరికీ తెలిసినప్పటికీ, యుద్ధాలు జరిగే అవకాశాలు తగ్గడానికవి ఉపకరిస్తవనీ ఆయన చెప్పారు.

అణుశక్తి కమిషనులో మళ్ళీ ప్రతిష్టంభన వచ్చినమాట విమర్శకులు గ్రహించినట్లు లేదనీ, ఇంకా చర్చలు సాగించడం వృథా అనీ ఆయన హెచ్చరించారు.

అల్పదేశాలనుగురించి మాట్లాడుతూ సర్ బి. నరసింగరావు, ఈ దేశాలు ఐక్యరాజ్య సమితిలో తమకుగల ప్రభావాన్ని తక్కువ చేసుకోరాదనీ, ఇవి కలిసికట్టుగా ఉన్నట్లయితే నైతికంగా ప్రపంచ వ్యవహారాలపై ఒత్తిడి తేగలవనీ, ఏ ప్రత్యేక సమస్య పెద్ద దేశాలనెంత బాధిస్తుందో అల్పదేశాలను అంతే బాధిస్తుందనీ. యుద్ధాలు రాకుండా చేయడం అల్పదేశాలవల్ల కాకపోయినా, వాటి దుష్ఫలితాలను తగ్గించడం వాని వశంలో ఉన్నదనీ, ఇందుకొరకే ఇండియా ప్రతిపాదన జరిగిందనీ ప్రస్తుత ప్రతిష్టంభననుండి బయటపడడమే దీని ఆశయమనీ, ఇండియా ప్రతిపాదనకు ఫ్రాన్సు కెనడాల ప్రతిపాదన అనుబంధంగా ఉన్నది. కనుక భారత ప్రతినిధులు ఫ్రాన్సు కెనడాల ప్రతిపాదనను బలపరుస్తారనీ అన్నారు.

అణుశక్తి అంతర్జాతీయ కంట్రోలు సాధ్యంకావడానికిగాను అన్ని దేశాలూ తమ తమ స్వాతంత్ర్యాలను కొంత కొంత వదులుకోవాలని సూచించే ఫ్రాన్సు కెనడాల ప్రతిపాదన ఈవారారంభంలో జరిగింది.

అణుశక్తి కంట్రోలు కేవల రాజకీయ సమస్య అంటూ ఇండియా ప్రతిపాదనను విమర్శించినది సార్వ ప్రతినిధి.

అన్ని దేశాలూ తమ తమ స్వాతంత్ర్యాలను కొంతవరకు విడిచిపుచ్చాలన్న దానికి బదులుగా, అన్ని దేశాలవారూ ఉమ్మడి అంగీకారంతో తమ తమ స్వాతంత్ర్యాలను తగ్గించుకోవాలంటూ ఫ్రాన్సు కెనడాల ప్రతిపాదన సవరణచేయబడింది.

పెట్టినను, ప్రేమగౌరవములు విడనాడకుండ, హక్కుకొరకు శాంతియుతముగా పోరాడుము సలుపవలెనని, పిల్లలకు విద్యాజ్ఞానములకై తగు కృషి సలిపి, అభివృద్ధి గాంచవలయునని హెచ్చరించిరి.

తిరుపతి, కె. షణ్ముఖంగారు, వ్యవసాయకూలీలు ఆగ్రహావేశాలు కొకుండా శాంతిముగా గాంధీగారి సిద్ధాంతము ననుసరించి నడచుకోవలెనని హెచ్చరించిరి. ఆహ్వాన సంఘముతోపుడ సభకు హాజరైన వారికందరికి అభినందనములు తెలిపిరి. కె. వెంకటసుబ్బయ్యగారి 'జనగణమన' గీతముతో సభ [illegible]. సభలో వయ్యి మంది పైగా తాలూకాలోని [illegible] హాజరైరి. (స్వ. వి.)

## చక్కెర కంట్రోలు త్వరగా పోవలెను

### కేంద్రచెఱకుకమిటీ సలహా

ఢిల్లీ, నవంబరు 12: భారత కేంద్ర చెఱకు కమిటీ నిన్నటినుండియు ఢిల్లీలో సమావేశమై యున్నది. దీప నారాయణ సింహాగారు (రాజ్యాంగ పరిషత్తు సభ్యులు) అధ్యక్షత వహించిరి.

కొనుగోలుదారుకు పరిమితమైన ధలకు చక్కెర అమ్మబడునట్లుగా మాత్రము, తగిన కట్టుదిట్టములు ప్రభుత్వముచేసి, ప్రస్తుతము అమలులో నుంచిన చక్కెర సప్లయి కంట్రోలు పద్ధతిని పూర్తిగా వీలైనంత త్వరలో తొలగించవలెనని యీ కమిటీ తన అభిప్రాయమును తెలియజేసెను.

దేశములో యిప్పుడేర్పడిన చక్కెర లోటు కేవలము కృత్రిమముగా కలుగజేయబడినదేగాని ఇంకొకటి కాదు ఫ్యాక్టరీలు చక్కెరను సమృద్ధిగా ఉత్పత్తి చేయక పోవుటవల్ల సేయిలోటు ఏర్పడు చున్నది. చక్కెర ఫ్యాక్టరీలు వెంటనే చెఱుకును తమ్మకలంగాగానుగ ఆడించవలెనని ప్రభుత్వము ఉత్తర్వు చేయవలెను అని యీ కమిటీ తన అభిప్రాయమును వెల్లడించెను.

## సంగ్రహ వార్తలు

### తిరుత్తని

తిరుత్తని తాలూకా ప్రొద్దుటూరుపేట సమీపమునగల కాపులూరు గ్రామ జన సేవాసంఘసభ్యులు 11 వ తేదీన శ్రీ బి. దొరస్వామిరెడ్డిగారి అధ్యక్షతను సమావేశమై తిరుత్తని తాలూకాలో 100 కి 99 పాళ్లు తెలుగువారే నివసించు చున్నారనియు, ఏ కొద్దిమంది అరవవారి శ్రేయస్సుకోరి తిరుత్తని తాలూకాను, చిత్తూరు జిల్లాను తమిళరాష్ట్రమున చేర్చరాదనియు, చిత్తూరుజిల్లాను సంపూర్ణముగా ఆంధ్రరాష్ట్రమునందే చేర్చవలెననియు, తీర్మానించిరి.

### ఉరవకొండ

ఉరవకొండలో చేనేత పారిశ్రామికులు శ్రీ వేల్పుల వెంకటేశప్పగారి అధ్యక్షత క్రింద జై హిందీ చేనేత పవనమందిరమున సమావేశమై, మిల్లుపోటీనుండి చేనేతపుడలకు కావలసిన రక్షణ యిప్పించి, పనిలేక ప్రస్తుతము అల్లాడిపోతువున్న చేనేత దారులకు పనిని కల్పించుటకు "రిలీఫ్" సెంటరు ప్రారంభించి, తగిన కూలీలు యిప్పించి సహాయం చేయుటకు ప్రభుత్వమువారు వెంటనే పూనుకొనవలయునని తీర్మానించినారు.

రాష్ట్రీ చేనేతవారు చీరాలలో సభలు జరుపుచున్నందుకు, యీ సభవారు మిక్కిలి హర్షించుచు, వారు చేయుబోవు తీర్మానములను బలపరచుటకు అంగీకరించిరి.

ఉరవకొండనుండి, అనంతపురము జిల్లా చేనేత కాంగ్రెసు కమిటీతరఫున శ్రీ చందా వెంకటేశులు గారిని పంపించినారు.

### నంద్యాల

నంద్యాల "కాటన్ అండ్ గ్రౌండ్ నట్ మార్కెటింగ్ కమిటీ" సభ్యత్వమునకై, పుత్పత్తిదార్ల పక్షమునగల 4 స్థానములకు పోటీచేసిన 7 గురు అభ్యర్థులందు శ్రీ ఆత్మకూరు నాగభూషణం, కాసిరెడ్డి తిమ్మారెడ్డి, బద్రి ఆంతిరెడ్డి, యం సి. బసిరెడ్డిగార్లు, అత్యధికసంఖ్యవోట్లతో యెన్నుకొనబడిరి. వారితో పోటీ చేసిన మిగతనుప్పురు అభ్యర్థులు శ్రీ దాదేఖాన్ షిరాని, తోట మద్దులేటి, పోలా కృష్ణారెడ్డిగార్లకు, చాలా తక్కువ వోట్లు వచ్చుటచే, వారు డిపాజిట్లుగూడా కోల్పోయిరి.

వ్యాపారుల తరఫున శ్రీ గోర్ల సత్యనారాయణ, శివపురం సుబ్రాయుడు, గజ్జల నాగిశెట్టిగార్లు పోటీ లేకుండా యెన్నుకొనబడిరి.

### పెనుకొండ

ఈ డివిజన్ సబ్ కలెక్టరుగానుండిన శ్రీ సి. యస్. కృష్ణమూర్తి ఐ. ఎ. యస్ గారు, పుదుక్కోట డివిజన్‌కు బదిలీచేయబడిన సందర్భమున, స్థానిక రివిన్యూ క్లర్కు వారు, వారి గౌరవార్థమై 10 వ తేదీన అల్పాహార విందొసంగిరి. వీరి స్థానమునకు నియమితులైన శ్రీ వి. వి. మునలాపుణి గారు కూడా ఆ దినమే చార్జి పుచ్చుకొనిరి. (స్వ. వి.)

### హిందూపురం

స్థానిక గ్రామోద్యోగ సబ్ ఇన్స్పెక్టరు శ్రీ నారాయణరావుగారి ఇంటిలో చోరీ అయిన వెండిసామానులును, స్థానిక వర్తకులు జగ్గా వెంకటస్వామిగారి ఇంటిలో చోరీయయిన సామానులు, బట్టలు [illegible] సబ్ ఇన్స్పెక్టరు [illegible] అన్నిటిని పట్టుకొనిరి. ఈ సందర్భమున పట్టె వెంకటరావు, మహమ్మద్ బేగ్, అబ్దుల్‌గఫూర్, [illegible] నిందితులు రిమాండుకు పంపబడిరి.

## రేడియో ప్రోగ్రాములు

నవంబరు 16 బుధవారం

### మద్రాసు (ఎ)

ఉ 7-30 ఆర్. జయలక్ష్మి వీణ. 8 ఆంగ్లమున వార్తలు. 8-15 ఉదయ సంగీతం (రి). 8-30 మద్రాసు (బి) వలె. మ 1-30 ఆంగ్లమున వార్తలు. 4-30 పాశ్చాత్య సంగీతం (రి). సా 5-30 వి. ఎస్. సీతారాం కుమార్ పాట. 6 ఆంగ్లమున వార్తలు. 6-20 అనంతలక్ష్మి నాగరాజన్ పాట. 7 టి. ఎస్. నారాయణరావు వయొలిన్. 7-30 సి. కె. లక్ష్మీదేవి 8 మద్రాసు (బి) వలె. 8-30 తిట్టయి కృష్ణయ్యంగార్ పాట. 9 ఆంగ్లమున వార్తలు. 9-15 ఆంగ్లమున ప్రసంగం. 9-30 మద్రాసు (బి) వలె. 10-0 నాత్రసంగీతం (రి).

### మద్రాసు (బి)

ఉ 7 తెలుగున వార్తలు. 7-15 మధుర మణిఅయ్యర్ రికార్డులు. 7-45 మద్రాసు (ఎ) వలె. 8-30 ఎం. రాజీవిబాయ్ పాట. మ 12 కార్మికుల కార్యక్రమం 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు పరిశోధనలు సాహసములు. కామ్వెల్. బేకర్ ప్రసంగం. వ్యాయామ పాఠాలు సి. సత్యానందం 1-30 మద్రాసు (ఎ) వలె. 1-50 తెలుగున వార్తలు. 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు ఎందుకు ఎలాగ గ్రహణం ఏర్పడును ప్రసంగం. విద్యార్థుల ప్రశ్నావళి. 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు సామెతలు, కథలు. ఉక్కు కొటుకు [illegible] ప్రసంగం. ఉచే ఇండు నాటిక సంగీత పాఠాలు సా 5-30 మద్రాసు (ఎ) వలె. 6-20 సాయం సంగీతం (రి). 6-30 గ్రామస్థుల కార్యక్రమం రసాయనికపు ఎరువుల ఉపయోగము, ప్రసంగం, కనుపు చల్లని తల్లి, జానపద గీతం. 7 తెలుగున వార్తలు. 7-15 వస్నెల పదాలు. 8 'సందిగ్ధము' రూపకము రచన 'గోపీచంద్', 8-30 మద్రాసు (ఎ) వలె. 9-30 పి. విశ్వనాధరావు వేణువు. 10 మద్రాసు (ఎ) వలె.

### విజయవాడ

ఉ॥ 7 తెలుగున వార్తలు. 7-15 రాధా, జయలక్ష్మి రికార్డులు. 7-30 చల్లపల్లి కృష్ణమూర్తి పాట. 8 ఆంగ్లమున వార్తలు. 8-15 గీతాంజలి నండూరి చారిబాబు. 8-30 తిరుపతి పొన్నారావు వయొలిన్. మ॥ 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు. 1 తారాపథం (రి). 1-30 ఆంగ్లమున వార్తలు 1-50 తెలుగున వార్తలు 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు. 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు. సా॥ 5-30 తిరుపతి పొన్నారావు వయొలిన్ 6 ఆంగ్లమున వార్తలు. 6-20 గీతాంజలి నండూరి చారిబాబు. 6-30 గ్రామస్థుల కార్యక్రమం (మద్రాసు నుండి). 7 తెలుగున వార్తలు. 7-30 చిత్రవాణి (రి). 7-45 ప్రస్తుత విశేషము ప్రసంగం. 8 శిష్టు గౌరిపతిశాస్త్రి వీణ. 8-30 యుగళగీతి నిలయ విద్వాంసులు. 9 ఆంగ్లమున వార్తలు 9-15 చిత్రవాణి (రి) 9-30 శిష్టు గౌరిపతిశాస్త్రి వీణ.

## మదరాసు ధరలు

మదరాసు, నవంబరు 14:

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు పరిపాటి 1-కి ఎక్స్చేంజి సిల్వు టూళ్ళతోసహా రు. 76-8-0 బంగారు తులం 115-8-0 గిని పబంగా 113 8-0 సీమవెండి తులం 100-కి [illegible] 168-0-0 వెండి తులం 1 కి 1-12-0

వేరుసెనగ: (581 పౌ 1-కి ఎక్స్ కోస్తాగిడ్డంగులు) కుప్పి (సిల్వుటూళ్ళతో సహా) బజారు కొత్తది .151, 152-8-0 రెడిటుకర్స్ యూ. యు. ఎ., రు 381-0-0 వేరుసెనగ నూనె ఎక్స్ పెల్లర్ (వివరణ) నవంబరు 15 వ డెలివరి రు. 828-0-0 ఓంకోయనూనె (87 పౌన్లు గల డబ్బా) ఒకటికి రు. 33-4-9, 33-8-9, పెనాంగు.

### ఆముదం

కొండి గింజ [illegible] రు. 290, 295

### పంచదార

ప్యారీ (2 అందరు) రు. 91-14-6
చక్కెర చిల్లరధర వీశ 1-కి 1-4-9

ఇ. పిరాన్ సాబు అనునతని ఇంటిలో చోరి అయి తనకు రిపోర్టు చేయబడని ఇంకొక కేసును సబ్ ఇన్స్పెక్టరు శ్రీ పి. వెంకటరెడ్డిగారు అచోకే తన పోయినవస్తువులను పై కేసులో నిందితుడైన అబ్దుల్ గఫూర్ అనునతనినుండి వశపరచుకొనిరి. (స్వ. వి.)

### లారీ ప్రమాదం : ఒకరి మరణం

మార్కాపురం, నవంబరు 11: ఎనుపెర్లపల్లి గ్రామమునకు సమీపమున పి. డబ్ల్యు. డి శాఖకు చెందిన ఒకలారి ఒక చెట్టుపడిపోబోయి తొలగా, రోడ్డుపైపనిచేయుచున్న ఒకకూలి దానిక్రిందపడి వెంటనే మరణించినాడు. గాయపడ్డవారు చికిత్స పొందుచున్నారు.

## రైళ్ల వేళలు

మద్రాస్ సెంట్రల్

| | రాక | పోక |
|---|---|---|
| కలకత్తా మెయిలు | ఉ 8-10 | సా 9-0 |
| ఢిల్లీ ఎక్స్‌ప్రెస్ | సా 5-5 | ఉ 10 5 |
| విశాఖ ప్యాసింజరు | రా 8-25 | సా 7-30 |
| డిటో ప్యాసింజరు | ఉ 10-10 | ఉ 8-0 |
| చిత్రగుంట ,, | మ 8-10 | మ 1-02 |
| బొంబాయి మెయిలు | ఉ 5-40 | రా 8-50 |
| ,, ఎక్స్‌ప్రెస్ | సా 7-10 | ఉ 7-10 |
| రాయచూరు ప్యాసెంజరు | సా 4-55 | ఉ 8-55 |
| రేణిగుంట ప్యాసింజరు | ఉ 9-48 | సా 3-55 |
| ,, ,, | రా 9-15 | — |
| ఆర్కోణం ,, | — | సా 6-38 |
| బెంగుళూరు మెయిలు | ఉ 6-0 | రా 9-15 |
| ,, ఎక్స్‌ప్రెస్ | సా 3-40 | మ 12-12 |
| బెంగుళూరు ప్యా॥ | ఉ 5-30 | రా 9-25 |
| ,, ,, | రా 8-40 | ఉ 6-40 |
| జాలార్పేట ,, | మ 1-15 | మ 11-30 |
| కొచిన్ ఎక్స్‌ప్రెస్ | ఉ 9-0 | సా 5-30 |
| మంగుళూరు ,, | ఉ 7-25 | సా 7-25 |
| ,, (3 తరగతి) | సా 5-20 | ఉ 9-05 |
| నీలగిరి ఎక్స్‌ప్రెస్ | ఉ 7-05 | సా 8-15 |



## నోటీసు

కాకినాడ సబార్డినేటు కోర్టులో
OS 1 of 39 EP 183/47

వాదులు: లింగంపల్లి స్వామినాయుడు వగైరాలు.

ప్రతివాదులు: నల్లమిల్లి వెంకటస్వామి 18 యీ అప్పలనాయుడు మయినరులు అయినందున గార్డియను అన్న 10 ప్రతివాది స్వామి నాయుడు సా॥ భూపాలపట్నం.

పై నెంబరులో 18-11-49 సం॥ రం తేదికి డిక్రీ అమలు నోటీసు నిమిత్తం వాయిదా అయివున్నది. సదరు తేదీకి మీరు ఆక్షేపణ వున్నయెడల కోర్టుకు హాజరు అయి తెలియపర్చుకోవలెను లేని యెడల మీమ్ములను యక్సపార్టీ చేయబడునని యిందుమూలముగా తెలుసుకోవలెను.

చావలిరెడ్డి గీతభూతులు,
కాకినాడ, 14-11-49 బి. ఏ. బి. ఎల్. వాదుల అడ్వకేటు.

## గంటల పంచాంగం

విరోధి సం॥ కార్తీక బ॥ నవమి 1949 సం॥ నవం॥ 15 మంగళవారం నవమి ఉ 7-6 పళని తె 4-55 పూ రా 11-8 వర్జ్యం ప 7-59 ల 9-30 ఉ.

బ॥ ఏకాదశి నవం॥ 16 బుధవారం ఏకాదశి రా 2-15 ఉత్తర రా 9-17 వర్జ్యం ఉ 7-15 గ వ తె 4-54 ఉ

# ఆంధ్రపత్రిక

విరోధి సం॥ కార్తీక బ॥ నవమి
మంగళవారం

## సర్దార్ పటేల్ విజ్ఞప్తి

రెండుమాసములలో స్వతంత్ర భారత రిపబ్లిక్ అవతరింప నున్నది. రాజ్యాంగపరిషత్తు మూడు సంవత్సరములుగ జరిపిన కృషిఫలితముగ తయారైన రాజ్యాంగ చట్టము ననుసరించి 1950 జనవరి 26 వ తేదీనుండి దేశపరిపాలన జరుగనున్నది. ప్రస్తుతము - 1947 ఆగస్టు 15 నుండి 1950 జనవరి 26 వరకూ-దేశపరిపాలన 1935 భారత ప్రభుత్వచట్టము ప్రకారము పరిపాలింపబడుచున్నది. ఈ చట్టమునకును, రాజ్యాంగపరిషత్తు తయారుచేసిన నూతన రాజ్యాంగ చట్టమునకును ప్రధానాంశము లందెట్టి వ్యత్యాసము లేదు. కనుక 1947 ఆగస్టు 15 నుండి దేశపరిపాలన ఎట్లు జరుగుచుండెనో, 1950 జనవరి 26 నుండికూడ అట్లే జరుగుననుభావము వ్యాపించినది. పరిపాలనాపద్ధతులందు, విధానమునందు మార్పు రాకున్న దేశ ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిస్థితులలోనూ ఎట్టి మార్పు రాదు.

క్రిందటిశనివారము భారత ఉపప్రధానమంత్రి సర్దార్ వల్లభాయ్ పటేల్ కేంద్రపారిశ్రామిక సలహా సంఘ స్థాయిసంఘ ప్రథమ సమావేశమునందు, దేశమునందలి ప్రస్తుత ఆర్థిక పరిస్థితులను, సాంఘికసమస్యలను సవివరముగ చర్చించుటేగాక, ఈ పరిస్థితులను మార్పు చేయవలసిన అవసరమును, అట్టి మార్పును సాధించుటకు అనుసరింపదగుమార్గములనుకూడ దీర్ఘముగ చర్చించిరి. ఆర్థికరంగమున అట్టి మార్పులు జరుగకున్న రాజకీయముగ ఎంతటి అభివృద్ధిని సాధించినను, ఆ యభివృద్ధిని నిలుపుకొనుట సాధ్యము గాదు. అందువలననే ఉపప్రధానమంత్రి సర్దార్ వల్లభాయ్ పటేల్ రాజకీయైక్యతను సాధించుటతో తృప్తిచెందక ఆర్థిక స్థిరత్వమును సాధించుటకు పూనుకొనవలసివచ్చెను. పారిశ్రామిక సలహాసంఘ స్థాయిసంఘ సమావేశమున ఈ లక్ష్యసాధనకు ప్రభుత్వమనుసరింపదలచిన విధానమును వివరించి, ధనికులు, పారిశ్రామికులు, కార్మికులు, కర్షకులు ఆవిధానము ఫలప్రదమగుటకు ప్రభుత్వముతో సహకరింపవలెనని విజ్ఞప్తి చేసిరి.

నేటి ఆర్థికదుస్థితికి ముఖ్యకారణము ఉత్పత్తి దేశావసరములకు తగ్గట్టు వృద్ధి గాకపోవుట, పరిశ్రమల అభివృద్ధికి, క్రొత్త పరిశ్రమల స్థాపనకు తగిన పెట్టుబడి లభింపక పోవుటే. ఉత్పత్తి పెరుగక పోవుటకు పనివారు, పారిశ్రామికులు కూడ బాధ్యత వహింప వలసియున్నది. కేంద్రప్రభుత్వ ప్రోత్సాహముపై పారిశ్రామిక అవహార ఒడంబడిక జరిగి, అందుకు యజమానులు, పనివారు, ప్రభుత్వము సమ్మతించి రెండు సంవత్సరము లైనది. ఈ ఒడంబడిక లక్ష్యము ఉత్పత్తిని అధికముచేయుటే. ఇంతవరకు ఈ లక్ష్యము సిద్ధింపలేదు. ప్రభుత్వమునకు చెల్లింపవలసిన పన్నులు, పనివారికి ఇచ్చుకొనవలసిన వేతనములు పెరిగినందున, ఉత్పత్తి ఖర్చులు పెరిగి పరిశ్రమలు గిట్టుబాటుగ నుండుట లేదని యజమానులు, జీవితవ్యయ ప్రమాణము విపరీతముగ పెరిగి పోవుటవలన తమకు లభించు వేతనములతో తాము పనిచేయజాలకున్నామని కార్మికులు ఉత్పత్తి నధికము చేయుటకు ఎట్టి ప్రయత్నము చేయుటలేదు.

సర్దార్ పటేల్ స్పష్టముచేసినట్లు ఈ సమస్య లన్నింటికి విరుగుడు అధికోత్పత్తే. అట్టి అధికోత్పత్తిని సాధించుటే ప్రతి ఒక్కరి విధ్యుక్త ధర్మము. సర్దార్ పటేల్ కేవలము వివిధ వర్గముల బాధ్యతల, విధుల వివరించుటతో తృప్తిచెందక, ఆయా వర్గములవారు వారి బాధ్యతలను, విధులను నిర్వర్తించుటకు ప్రభుత్వము చేయదలచిన సహాయమును కూడ వివరించియుండిరి. ఇప్పటి వస్తువుల ధరల ప్రమాణము నిలబడియుండుటకు వీలు లేదని, వస్తువుల ధరలు తగ్గితీరవలెనని సర్దార్ పటేల్ విస్పష్టముగ ప్రకటించెను. అట్లే పారిశ్రామికుల పన్నుభారమును తగ్గించుటకుకూడ ప్రభుత్వము అవసరచర్యలు తీసుకొనుననని ఉపప్రధానమంత్రి హామీ యిచ్చెను. మాటు పడిపోయిన ధనమును తిరిగి పెట్టుబడికి వినియోగించిన అట్టివారిని దండింపమనికూడ హామీ నిచ్చిరి అదే సమావేశమున ఆర్థికమంత్రి డాక్టర్ మత్తాయ్ రాబోవు బడ్జెట్ లో పన్నుల తగ్గింపు జరుగగలదనే తెలిపిరి. మాటుపడిన ధనము తిరిగి వినియోగమునకు వచ్చుటకు ప్రభుత్వము త్వరలో జారిచేయనున్న ఆర్డినెన్సు ఉపయోగపడగలదని వీరు సూచించిరి.

ఈ హామీలను పురస్కరించుకొని కేంద్ర పారిశ్రామిక సలహాసంఘ స్థాయిసంఘమువారు అధికోత్పత్తి సాధనకు కార్యకర్తల సంఘములను స్థాపింపవలెనని సూచించిరి. సంఘముల స్థాపనవలననే అధికోత్పత్తి సాధ్యముగాదు. 1947 ఒడంబడిక ఇంతవరకు ఏమియు సాధింపలేక పోవుటను గమనించిన ఈ క్రొత్త సంఘముల ఏర్పాటువలన ఏమి జరుగగలదను అనుమానము కలుగక తప్పదు. పారిశ్రామికుల, పనివారల, ప్రజల దృక్పథము మార్పుచెందవలెను. హృదయ పరివర్తనము జరుగవలెను. అవి జరుగనంతవరకు ప్రభుత్వము ఎన్నివిధముల ప్రయత్నించినను ఫలితము వుండదు.

1950 జనవరి 26-న నూతన రాజ్యాంగము అమలుకు వచ్చుటకు పూర్వమే, దేశ ఆర్థికవ్యవస్థ స్థిరీకరణకు ప్రయత్నములు ప్రారంభమగుటేగాక ఫలోన్ముఖము కావలెను. లేకున్న నూతన రాజ్యాంగము అమలు జరుపుటలో ఏర్పడు వివిధ రాజకీయ, సాంఘిక సమస్యల పరిష్కరించుటలో ప్రభుత్వము నిమగ్నమై యున్న ఆర్థిక సమస్యలపై దృష్టినైనను కేంద్రీకరించుటకు అధికార వర్గములకు వ్యవధి యుండదు. కనుక ఈలోపుననే నూతనార్థిక వ్యవస్థకు బునాదులను వేయుట అత్యవసరము. సర్దార్ పటేల్ ప్రమేయము వలన ఇ... వచ్చును. కనుకయిందలి అన్ని వర్గములు సర్దార్ పటేల్ విజ్ఞాపనమును పాలించి వస్తూత్పత్తి వృద్ధికి తీవ్ర కృషి చేయవలెను.

## వ్యావసాయిక వివర సేకరణ

### ప్రత్యేక సంఘ నివేదిక

న్యూఢిల్లీ, నవంబర్ 13: "వ్యావసాయిక లెక్కలను తయారు చేయటానికి చాలా జాగ్రత్తైన క్రమపద్ధతి అనుసరించాలి. లెక్కల తయారు చేయటానికి క్రమమైన వ్యవస్థ నిర్మించాలి," అని భారత ప్రభుత్వం నియమించిన వ్యావసాయిక లెక్కల సంఘంవారు, తమ నివేదికలో తెలియజేశారు. 1950-51 లో జరుగనున్న ప్రపంచ వ్యావసాయిక సంఘానికి మన దేశంతాలూకు లెక్కలను అందజేసే నిమిత్తం, సరియైన లెక్కలు తయారు చేయటానికి ప్రభుత్వం కడచిన ఏప్రియల్ మాసంలో ఈ సంఘాన్ని నియమించారు. ప్రపంచ సంఘంవారు కోరిన భోగట్టాలనేకాక సంఘంవారు, భారతదేశపు వ్యావసాయిక భోగట్టా నంతా సమగ్రంగా సేకరించటానికి తగిన విధానాలు సూచించుతున్నారు. ఈ లెక్కలను శాశ్వతంగా పనికివచ్చేలాగు తయారుచేయించటానికి ప్రయత్నాలు జరుగుతున్నయ్.

దేశంలో 7810 లక్షల యెకరాలభూమి వుంది. దీట్లో 6570 లక్షల యెకరాలకు సంబంధించిన భోగట్టామాత్రమే అందుబాటులోవుంది. మిగిలిన దానివిషయాలేమి తెలియవు. ఈ లభించినలెక్కలుకూడా ఖచ్చితమైనవీ, సమగ్రమైనవీ అనటానికి వీలేదు, ఎందుచేతనంటే ఈ లెక్కలను సేకరించటంలో ఒకక్రమమైనపద్ధతిఅంటూ అనుసరించబడలేదు.

ప్రస్తుతమున్న లెక్కలలోని అంకెలు. (1) సమగ్రమైనవికావు. (2) భూమిని వివిధరకాలుగా విభజించటంలో ఒక క్రమవిధానంలేదు. (3) లెక్కలు వ్రాయటంలో క్రమపద్ధతిలేదు. (4) భోగట్టా తీయటంలోని లోపాలు. (5) అజమాయిషీలోపం. (6) లెక్కలతయారీకి నిర్ణీతమైన పద్ధతిలేదు.

దేశంలోవున్న యావత్తుభూమినిగురించీ ప్రతియెకరానికీ వచ్చేనికరాదాయాన్ని గురించీ నికరమైన భోగట్టా ... భారతదేశంలోని వ్యావసాయికలెక్కలు పరిష్కరించటానికి వీల్లేదు.

అసలు ఈ అంకెలన్నీ రావటానికి కారణమేమంటే, ఆయా గ్రామీణ ప్రాంతాలలో ఈ లెక్కలన్నీ తయారుచేసి అందజేయవలసినవాడు ఒక్క గ్రామకరణం. గ్రామానికి సంబంధించి యావత్తు విషయాలు ఈ గ్రామాధికారి ఒక్కడే చూడాలి. ఈయనకువున్న పని ఒత్తిడిలో ఈ లెక్కలను గురించి తగినశ్రద్ధ వహించటానికి సావకాశం వుండదు. సరియైన లెక్కలు తయారుచేయటానికి అవకాశం వుండాలంటే కరణాలకు పనిభారం కొంత తగ్గించాలి. ప్రస్తుతం నిర్బంధ ధాన్యసేకరణ విధానం అమలులోవున్న కారణం గా కూడా గ్రామకరణాలు కొంతం పాక్షికమైన లెక్కలు చూపెట్టటం సహజం.

సర్వే కాని ప్రాంతాలన్నీ వెంటనే సర్వే చేయించాలి. ఆయాభూములలోని ప్రధానపంటల వార్షికాదాయాన్ని లెక్కతీసేటప్పుడు ఆయానిర్ణీత ప్రాంతాలలో మచ్చుకోతలు కోయించి అంచనావేయాలి. అయిదు సంవత్సరాల కొకతూరి రైత్వారీ పట్టాల విస్తీర్ణాన్ని లెక్కతీయాలి.

లెక్కల తయారీకి, అన్ని ప్రాంతాలకూ, అన్ని రాష్ట్రాలకూ ఒకే రకమైన ఫారాలను పంపించాలి! అని సూచించారు.

ఈ రకం ఫారాల నమోనాలను యీ సంఘంవారు తయారు చేశారు.

ఈ లెక్కల తయారీకి, వ్యవసాయదారులూ, వర్తకులూ, భూకామందులూ గల అనధికార సంస్థలను ప్రోత్సహించటం మంచిదని సూచించారు.

ఈ సంఘానికి ప్రభుత్వ వ్యావసాయిక శాఖలోని చీఫాలజిస్టు డైరెక్టర్ డబ్ల్యు. ఆర్. నాటూ అధ్యక్షులుగా వున్నారు.

## బొంబాయి పోలీసు ఇన్స్పెక్టరు కాప్టే

న్యూయార్కు, నవంబరు 13: బొంబాయి పోలీసు ఇన్స్పెక్టరు జనరలు ఎన్. ఎమ్. కాప్టే వాషింగ్టన్ లో అపరాధపరిశోధన కార్యాలయంలో ఉపయోగింపబడుతున్న నవీనపద్ధతులను కొంతకాలంపాటు స్వయంగా పరిశీలించి నేర్చుకొన్నారు. ఈయన వాషింగ్టన్ నుండి ఈ వేళ న్యూయార్కుకు వచ్చెను. కాప్టేయారప్ అమెరికాలో 6 నెలలపాటు పర్యటించి, అపరాధ పరిశోధనకు పాశ్చాత్య దేశాలలో ఉపయోగింప బడుతున్న పద్ధతులను పరిశీలించాలని వచ్చారు.

## తుపాన్ నష్టం వివరాలు

### ప్రభుత్వ ప్రకటన

(1-వ పేజీ తరువాయి)

ఏలూరు :—పల్లం - 49838 మెరక - 14603, చెరువులు - 8 జనం - 2 పశువులు 716, ఇండ్లు 11883.

తణుకు :—పల్లం - 65222, మెరక - 16,601 జనం—9, పశువులు 227 ఇండ్లు 11534.

భీమవరం :—పల్లం - 117284, మెరక 10,532, జనం - 14, పశువులు - 1264 ఇండ్లు 29,580.

నర్సాపురం :—పల్లం -88212, మెరక 10058, జనం - 31 పశువులు - 4125 ఇండ్లు - 1132.

చింతలపూడి :—పల్లం - 10,000 మెరక - 2000 చెరువులు 12, జనం -1, పశువులు 778 ఇండ్లు 1132.

పోలవరం :—పల్లం - 9761, మెరక 6203, చెరువులు 4, జనం - 1, పశువులు 1802, ఇండ్లు 1730.

తతిం, టెలిఫోను, రోడ్డు రైలుమార్గములు లన్ని చెడినవి. రవాణా నిరోధాలుతొలగించబడుచున్నవి. ఏలూరుపురంలో నీటిసప్లయి ఎలక్ట్రిసిటీ సరిచేయ బడింది. బాధితుల కుటుంబాలను వేరేచోటికి తీసుకపోయి ఉచిత భోజన వసతి ఏర్పాటు చేయబడెను. ఇండ్లుకట్టుకు నేందుకు వెదురు, పిల్లి దూలాలు, సప్లయి చేసేయేర్పాటులు కలక్టరుగారు చేయుచున్నారు. పేదలకు తాళ్లు ఉచితంగా యిస్తున్నారు.

### కృష్ణజిల్లా

#### 651 జనం 102,578 ఎకరాల పల్లం నష్టం

సెప్టెంబరు వరదలవలన నందిగామ, విజయవాడ దివితాలూకాలందు చెరి 1000 యిండ్లు నష్టపడి ఒకరు చనిపోయారు.

తుపానువలన మచిలీపట్నంలో పూరిండ్లన్నియు, పక్కాయిండ్లు అనేకం చాలనష్టపోయినవని కలక్టరు ముందుగా తెలిపియుండెను. టెలిఫోను, ఎలక్ట్రిక్ తీగలన్నియు తెగిపోయినవి. విజయవాడనుండి సప్లయి రాలేదు. బసలు భోజనాలు కలక్టరుగారు ఏర్పాటుచేసిరి. ఇటీవలి వార్త ఉద్వారా మొత్తం 651 జననష్టం, 14594 పశునష్టం, కలిగినట్లు, 79848 పూరిండ్లు చెడినట్లు తెలిసెను, 22 ఇరిగేషను కూతులు, 65 ఇరిగేషను పుంలు చెడినవి. పంటలకు 102578 పల్లం, 25,000 ఎకరాల మెరకజాగా నష్టపడెను.

### గుంటూరు

#### 57080 ఎకరాల పంట 20166 ఇండ్లు నష్టం

మొన్నటి తుపానువల్ల యీ జిల్లాలో నష్టం తాజావార్తల ద్వారా తెలిసింది. జననష్టం - 5. పశువులు 165 ఇండ్లు - 20156 పంటలు 57080 ఎకరాలలో నష్టం అందు 38,800 ఎకరాలు వరిపంట.

తాలూకావారీగా వివరాలు :- తెనాలి వరి 20,000 ఇతరపంటలు 8570ఎ. ఇండ్లు 1080 పశువులు.

గుంటూరు - వరి, 8000 ఎ ఇతర పంటలు 5712, ఇండు - 6012. జనం-3 పశువులు 54 చెరువులు - 18.

బాపట్ల— వరి - 15800ఎ. ఇండ్లు-95 సత్తెనపల్లి - ఇతర పంటలు 9000 ఎ, ఇండ్లు 195. జనం - ఒకడుగాయపడెను. పశువులు 2 చెరువులు - 8.

నర్సరావుపేట - ఇండు - 33. రేపల్లి - ఇండ్లు 850.

గుంటూరునో కలియు దరోడ్లు చెడినవి. ఒక వంతెన కూలిపోయింది చిన్న చెరువులు 10 బాగు చేయబడినవి సహాయ కేంద్రాలు 5 గుంటూరు లో ఏర్పాటు చేయబడినవి. గ్రామాలలో ఒకవారం రేషను ఉచితంగా యివ్వబడెను. తాడేపల్లియందు 175 బస్తాలు, ఉండవల్లియందు 48 బస్తాలు బియ్యం పంచిపెట్టబడెను. మంగళగిరియందు డిప్టీ తాశీల్దారు మూడురోజులు అన్నదానం చేయించెను. పూర్తిగ చెడిన గుడిసెలకు చెరి రూ 10 చొ॥ చిన్నగుడిసెలకు రూ 5 చొ॥న నగదు, ఉచితంగ యిచ్చిన వరకుగాక యివ్వబడెను. గుంటూరు తాలూకాయందు రెండు గ్రామాలలో రిలీఫ్ షాపులు తెరువబడెను. ఇతరచోట్ల అట్టి దుకాణాలు అవసరం లేకపోయింది.

సెప్టంబరు వరదలవలన 9 రోడ్లు పలుతావులందు చెడెను. పబ్లికువర్క్సు శాఖ జలాధారాలు పెద్దవి చెడినవి. మైనరు ఇరిగేషను చెరువులు 8 చెడినవి. కొన్నిచోట్ల మరమ్మతులు జరిగినవి. కొన్నింట చుట్టుగట్టువేసి నీరు నిలవచేయబడెను.

28,000 భోజనాలు పెట్టి, ఒక కుటుంబానికి 10 వడుస్సు, తాటి ఆకులు ప్రమాణలు యివ్వబడినవి.

మొత్తం 53072 వడుస్సు, 38200 తాటాకులు, 21 తాటిమానులు ఉచితంగా యివ్వబడెను.

ఇంకవరకు రూ 44,841/- ఖర్చయింది. లంకప్రాంతాలందు రూ 10 చొ॥నయితర చోట్ల రూ 5 నుండి 7 వరకు చెరి కుటుంబానికి ఒసంగబడెను. ఆహార ధాన్యాలు, తేనాంధాన్య, ఎరువులు సగంధరలకు విక్రయించే యేర్పాటు చేయబడెను. 25 లారీలతోను, 11 బండ్లతోను కసువు పశువులున్నవారికొసంగబడెను. 1016 బస్తాల బియ్యం పంచిపెట్టబడెను. వ్యవసాయ పనిముట్లు ఎచటికి ఎక్కువగా పంపబడెను.

### నెల్లూరు

#### 600 ఎకరాల పంటనష్టం

నెల్లూరుజిల్లా తాలూకావారీ నష్ట వివరాలు:-

కావ్యూరు 100 ఎకరాలు, 29 ఇండ్లు. పొదిలి, దర్శితాలూకాలు- 700 నుండి 600 ఎ॥ 1000 ఇండ్లు. 15 పశువులు 1000 మేకలు.

నెల్లూరు-433 ఇండ్లు. 2 పశువులు. కనిగిరిలో 62, ఆత్మకూరులో 32 యిండ్లు చెడినవి.

పదిరోడ్లు చెడినవి ప్రక్కమార్గములు ఏర్పాటుచేయబడినవి. నెల్లూరు, సంగం ఆనకట్టలు చెడినవి. పెన్నారు నది గట్టు తెగింది. చెరువులు పొదిలిలో 8 కనిగిరిలో 3 దర్శిలో 54 చెడినవి. మరమ్మత్తులు జరుగుచున్నవి.

ఇండ్లు కట్టుకు నేందుకు ఉచితంగాను, కుటుంబానికి రూ 20 చొ॥న ఒసంగబడెను.

### కడపజిల్లా

#### 9000 ఎకరాల నష్టం

కడపజిల్లాలో ప్రొద్దుటూరు తాలూకాయందు 6700 ఎకరాలు, జమ్మలమడుగు 2275, సిద్ధవటం 170, బద్వేలు 95, కమలాపురం 25 ఎకరాలపంట నష్టమయ్యెను. మేజరు చెరువులు 4, మైనరు చెరువులు 7, పశువులు 50 నష్టమయినవి.

8 రోడ్లు, 3 తూములు చెడినవి. మరమ్మత్తుపని జరుగుచున్నది. కర్నూలు కడప కాల్వ మాడుచోట్ల గట్టుతెగింది. కొన్ని పూడ్చబడినవి. కాల్వ క్రింద పంటలు బాగా సేయున్నవి. ప్రొద్దుటూరు, కడప తాలూకా రయితులకు 7 ఆయిలు ఇంజను పంపులు, 2 పెట్రోలు పంపులు ఒసంగబడెను. 500 ట. అమోనియం సల్ఫేటు ఒసంగబడెను. ఇంకో 700 ట. యివ్వబడును. వడ్డీలేనిఋణాలు, కుటుంబానికి రూ॥ 12 చొ॥న ద్రవ్యం, ఇండ్లకలప ఉచితంగాను యిచ్చిరి.

### కర్నూలు

#### 19000 ఎకరాల పంటనష్టం 12 మందిజనం నష్టం

కర్నూలుజిల్లాలో మొత్తం 19000 ఎకరాల మెరకపంట, 650 ఎ. పల్లం పంట నష్టమయింది. 11 మేజరు చెరువులు, 24 వొన చెరువులు, 19558 ఇండ్లు నష్టపడి, 12 జనం, 1949 పశువులు చనిపోయినవి.

చెరువులకు గట్లువేయుటవలన ఆయకట్టుకి నష్టంకలుగలేదు. నంద్యాల-కంభం మధ్య రైలుమార్గం చెడింది.

బాధితులకు భోజనాలు బసలు ఒసంగబడెను అడవులలో పసుమేత ఉచితముగా యిచ్చిరి. 10510 కుటుంబాలకు నగదు ఒసంగబడెను. కర్నూలులో ఏర్పడిన అధికారేతర సహాయసంఘం పేదలయిండ్లకు రూ 2000 పంచెను. కలక్టరు రూ 50,000 ఖర్చుచేసి, యింకా ఎక్కువకు అనుమతి కోరెను.

### బళ్లారి జిల్లా

ఆదోని తాలూకాలో 48 ఇండ్లు, 6 గురు జనం, 8 గేదెలు చనిపోయినవి. బళ్లారిలో ఇద్దరు, ఆలూరులో 5 గురు చనిపోయిరి పంటలు బాగానే యున్నవి. జలాధారాలన్నీ చెడలేదు. తాళ్లు ఉచితంగా ఒసంగబడెను.

## మద్రాస్ కౌన్సిల్లో

### రివిన్యూమంత్రి ప్రకటన

మదరాసు, నవంబరు 14: ప్రశ్నోత్తరముల తరువాత నేడు మదరాసు కవున్సిలులో రివిన్యూమంత్రి శ్రీ సీతారామరెడ్డిగారు ఆంధ్ర జిల్లాలలో ఇటీవల సంభవించిన తుపానువలన ఏర్పడిన పరిస్థితిని పరిశీలించవలసినదని ప్రతిపాదించిరి. సర్కారులు, రాయలసీమ జిల్లాలకు సెప్టెంబరులోవచ్చిన వరదలవల్ల కలిగిన నష్టమును గురించి సభ్యులకు విశదమే. ప్రజలకు కూడా ఏమీ దాచకుండా వాస్తవ పరిస్థితి తెలియజేయబడినది. పెన్నా, కృష్ణా, తుంగభద్ర వరదలవలన నెల్లూరు, గుంటూరు, కృష్ణా, కర్నూలుకు దెబ్బతగిలి ముఖ్యముగా నష్టము కృష్ణా, గుంటూరులకు విపరీతముగా నష్టం కలిగెను. ఈజిల్లాలకే మరల తుపానుదెబ్బ తగిలింది. వరదనుండి తప్పించుకున్న విశాఖపట్నం, గోదావరి జిల్లాలు తుపానువల్ల బాగా దెబ్బతిన్నవి.

వాతావరణ పరిశీలనశాఖవారు 26 తేదీన తుపాను హెచ్చరిక చేసిరి. 27 న ఆలిండియా రేడియో మదరాసు, విజయవాడ కేంద్రములు ఆంధ్రప్రజలకు పెద్ద తుపాను రానున్నదని హెచ్చరిక ఇచ్చెను. ఈ హెచ్చరిక కలెక్టర్లకు ఆధీన ఉద్యోగులకు అందజేయబడెను. పంటలు చెడ్డగా దెబ్బతిన్నవి. టెలిగ్రాం, టెలిఫోన్ వార్తలకు, ఇతర రాకపోకలకు అవాంతరమేర్పడెను. తుపాన్ ఉధృతమునకు నీరు, ఎలెక్ట్రిసిటీ సరఫరాలుబందు అయినవి.

శ్రీ సీతారామరెడ్డిగారు ఇటీవల వరద తుపానుల్ల కలిగిన నష్టము, ప్రభుత్వము తీసుకొను చర్యలను వివరించిన వివాదట ఇట్లు చెప్పిరి.

(నష్టముల వివరములు ప్రకటన విడిగా ప్రకటింపబడినది.) నెల్లూరు జిల్లాలో సెప్టెంబరు వరదలకు ప్రధానమైన రోడ్లకు భంగకల్పడ్డది. పెన్నారువరద గట్టుకూడా గండిపడెను. నెల్లూరుసంగం ఆనకట్టలేగాక 60 ఇరిగేషన్ చెరువులు చెడిపోయెను. 1500 నివాసగృహములు కొట్టుకొని పోయినవి. 700 యకరములలో పంటపాడైనది. కర్నూలు కడప రోడ్డు రాకపోకలు చెడిపోయినవి. కర్నూలులో 30 చెరువులకు, కర్నూలు కడప కాల్వకు గన్డుపడినవి. కర్నూలులో 20 వేల యకరములు, కడపలో 9 వేల యకరములలోని పంటదెబ్బతిన్నది కర్నూలు, నంద్యాల పట్టణములలో సుమారు 19 వేలిండ్లు, బళ్ళారిలో చాలాఇండ్లు దెబ్బతిన్నవి.

గుంటూరులో వరదలవల్ల 51 వేల యకరముల పంటకు 6000 ఇళ్లకు నష్టము వాటిల్లినది. ట్రంకు రోడ్, ఇతరరోడ్డులు, రైల్వేకు గన్డుపడినవి. గతమాసము తుపాను వలన 38 వేల యకరములలోని ధాన్యపు పంటకు 18 వేల యకరములలోని ఇతర పంటకు నష్టముకలిగినది సెప్టెంబరు వరదలలో చెప్పుకోదగ్గ పసునష్టము వాటిల్లినది.

కృష్ణా జిల్లాలో వరదలవల్ల కొన్ని వేల ఇళ్లుకొట్టుకొని పోవుటగాని, చెడిపోవుటగాని సంభవించినది. మచిలీపట్నం, విజయవాడలలో కూడ ఇళ్ళు పడిపోయినవి. మచిలీపట్నములో 24 గంటల్లో 20 అంగుళముల వర్షము పడెను. పట్టణము కొంతకాలము వరదలో మునిగియున్నది. ప్రాణనష్టముకూడ హెచ్చుగావున్నది. ఇక్కడ 651 వరకు ప్రాణనష్టమున్నది.

పశ్చిమ గోదావరిజిల్లాలో కొల్లేరు తటాకము యితర జలాశయముల ప్రవాహములో 9000 ఎకరముల పైరు సెప్టెంబరులో మునిగి పోయినది. అక్టోబరు నందు వీచిన పెనుగాలివల్ల కోస్తా తాలూకాలందు ప్రజల సేకలు చనిపోయి చాలా పసుసంపద నష్టమైనది. లోపలి తాలూకాలలో అనేక యిండ్లు గుడిసెలు కూలి ప్రాణనష్టము కలిగినది.

సాళవపంట పూర్తిగా నష్టమైనది. బాళవాపంట 75% చెడినది. కాని యీ నష్టము నిజముగా ఎంత అనేది పూర్తి రనిఖీ జరిగినతరువాతగాని తెలియదు.

తూర్పు గోదావరిజిల్లాలో కోస్తాప్రదేశమునకు 5 మైళ్ళవరకు రెండు తాలూకాలలోగల ప్రాంతమంతా మునిగిపోయెను. తుపాను కారణముగా 58 మంది చనిపోయియుండవచ్చు లేక తప్పిపోవవచ్చు జరిగినదని తెలియుచున్నది. 4000 పైగా పసుగణము నష్టమైనది ఈనష్టం విశేషభాగం కోస్తా తాలూకాలలో సంభవించెను. అనేక పబ్లిక్ భవనాలు జిల్లాలో దెబ్బతిన్నవి. ఒక సబ్ ట్రెజరీయును తునిలో పోలీసుల యిండ్లు నష్టపడినవి.

అనేకములైన నీటిపారుదల కాల్వలు, చెరువులు తెగి, వరదలు సంభవించెను ప్రవాహముల నష్టమైన యిండ్లు గుడిసెలసంఖ్య 40000 పైగా సంభవను. వరికోత అయి నూర్పుటకు సిద్ధముగానున్న ధాన్యము విశేషముగా కొట్టుకొని పోయెను. సుమారు లక్షన్నర ఎకరముల ప్రాంతమున చేలమీద నుండిన ధాన్యము బహుశా పాడైనది. కోస్తా తాలూకాలలో పెంకుటయిండ్లు పూర్తిగా నష్టపడినవి. రైలుమార్గము, రోడ్లు చాలా చోట్లలో గండ్లు పడినవి.

విశాఖపట్నంజిల్లాలో శారద, వంశధారా, నాగవళినదులు పొంగి విస్తార ప్రదేశములు నీటిలో మునిగిపోయెను. రైల్వే మార్గము, రోడ్లు తెగిపోయినవి. అనకాపల్లి సబ్ట్రెజరీకి కొంత నష్టము వాటిల్లినది. అనేక వేల ఎకరముల పంటలు పాడైనవని ఎంచబడుచున్నది. జిల్లా మొత్తంమీద అనేకవందల గుడిసెలు దెబ్బతిన్నవి. తుపాను దెబ్బతగిలిన ప్రాంతాలలో అధికారులు స్థానిక ధర్మాత్ముల సహకారంతో బాధితులకు పబ్లిక్ భవనాలలో ఆశ్రయమిచ్చి అవసరమైన సహాయము లొసగిరి. వస్త్రములు ఆహారము నివాసములకు వసతు ఏర్పాట్లు చేయబడినవి. సహాయపనులలో ప్రభుత్వమునకు అత్యంతముగా తోడ్పడిన అనధికారులకు ఔదార్యవంతులకు ప్రభుత్వము కృతజ్ఞతను తెలుపుచున్నది.

తుపాను బాధిత జిల్లాలను పర్యటించి పరిస్థితి వివరములను తెలిసికొనుటకు రివిన్యూబోర్డు సభ్యులను ప్రభుత్వము నియమించి నష్టముల వివరములు ఎంత సహాయము అవసరమనే విషయము వెంటనే తెలుపవలెనని కోరినది. గృహ నిర్మాణ పరికరాలు వెంటనే ఉచితముగా బాధితులకివ్వవలసినట్లుగా ఉత్తరువుచేయమని జిల్లాకలెక్టరులకు యీ సభ్యులు ఉత్తరవు చేసిరి.

సెప్టెంబరు వరదలవల్ల బాధితులైన ప్రజల సహాయమునకై మొత్తంమీద 4 లక్షల రూపాయలు కృష్ణా గుంటూరు జిల్లాలకు చెరి ఒక్కొక్కటి, బళ్ళారి కడప కర్నూలు నెల్లూరు జిల్లాలకు చెరి అరలక్ష చొప్పున పంచుటకు ప్రభుత్వము గ్రాంటు నిచ్చినది. పై మొత్తముగాక మరి 245000 రూపాయలు విశాఖకు రూ 75000 తూ॥ గోదావరికి రూ 50000 పశ్చిమ గోదావరి, కృష్ణ గుంటూరు జిల్లాలకు చెరి రూ 40000 కూడా సహాయ్యపనులనిమిత్తం సాంక్షను చేయడమైనది.

వీటితోపాటు కృష్ణ గోదావరితుపాను సహాయ్యనిధినుండికూడా రూ॥ 35000 యివ్వబడియున్నది. స్థానికప్రజలు పలునిధులు సమకూర్చి సర్వసహాయ్యములను చేస్తున్నారు. మదరాసు క్షేమనిధిద్వారా కూడా గవర్నరువిన్న పముమీద ధనము పోగుచేయబడుచున్నది. గవర్నరువారు రూ 5000 విరాళ మొసగియున్నారు అనేకులు పెద్దమొత్తాలు విరాళాలివ్వ సిద్ధముగుచున్నారు.

వీలయినచోట్ల ఉచితముగా గృహనిర్మాణమునకు కలప ఇచ్చుచున్నారు. దెబ్బతిన్న ప్రాంతములలో పాకల నిర్మాణమునకు డబ్బు కలపకూడ ఇవ్వబడుచున్నది. నివారణ కార్యక్రమమునకు అవసరమైన చోట ప్రత్యేకముగా రివిన్యూ సిబ్బంది ఇవ్వబడుచున్నది.

సాధ్యమైనంతవరకు ప్రక్కమార్గములు వేసి రాకపోకలకు సౌకర్యము కల్పించబడుచున్నది. ఎట్టి ఆలస్యము లేకుండా రోడ్ల మరమ్మతుకు పూనుకొనబడెను. సెప్టెంబర్ వరదదెబ్బతిన్న ప్రాంతములలో రాకపోకలు మామూలు స్థితికి వచ్చినవి. కొన్నిచోట్ల పనిచురుకుగా జరుగుచున్నది. ఇరిగేషన్ వనరుల మరమ్మతుకు ప్రాధాన్య మివ్వబడి ఎస్టేట్లలోని నీటివనరుల మరమ్మతుకుకూడ ఉత్తర్వు ఇచ్చుట జరిగెను. కృష్ణా, నెల్లూరు జిల్లాలకు ప్రత్యేక సిబ్బంది మంజూరు చేయబడినది. అంటువ్యాధులు వ్యాపించకుండా, పుట్టకుండా చూచుటకుగాను తుపాను దెబ్బతిన్న ప్రాంతములకు తగినన్ని పరికరములతో ప్రత్యేక సిబ్బందిని ఉరికించవలెనని ప్రజారోగ్య డైరెక్టరుకు తాఖీదు పంపియున్నాము.

కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలలో పశువులు, వ్యవసాయ పరికరములు కోల్పోయిన బీదరైతులకు రు 500/- వరకు వడ్డీలేకుండా తక్కావీ మంజూరు చేయవలెనని ఉత్తర్వులివ్వబడినవి. ఈ సౌకర్యము విశాఖపట్టం తూర్పు, పశ్చిమగోదావరి జిల్లాలలోకూడ ఇచ్చే విషయము పరిశీలించబడుచున్నది. ఈ ఋణమునకు వచ్చే దరఖాస్తుల పరిష్కారములో జాగు వుండకూడదని సిబ్బందికి అవసరమగు ఉత్తర్వులు ఇవ్వబడెను.

వరద, తుపానువలన నష్టపడిన ప్రాంతమునకు రెండవ పంటకు నీరు సప్లయి విషయము ప్రాధాన్యము ఇవ్వవలెనని ఉత్తర్వులు ఇవ్వనున్నాము.

కొబ్బరితోటలకు, ఇతర తోటలకు, లంక భూములకుకూడ రిమిషన్ ఇవ్వవలెనని సూచించబడినది. ఈ సూచన పరిశీలించబడుచుండి. ఇంకా అనేకసంస్థల అనధికార్లు సూచనలు చేయుచు, పత్రికలకు ప్రభుత్వమునకు వ్రాసిరి. వీటినన్నింటిని శ్రద్ధగా పరిశీలించెదరని అనిరి.

శ్రీ ఏ. వీరభద్రరావుగారు, ఆంధ్ర జిల్లాలలో తుపాను బాధితులకు ప్రభుత్వము చేయదలచియున్న సహాయ్యమునుగూర్చి మాట్లాడుతూ ప్రజలు చాలా యిండ్లు కోల్పోయి యున్నందున వారిని వారిండ్ల పునర్నిర్మాణమునకు వలయు పరికరములను వెంటనే యిచ్చి ప్రోత్సహించవలెను. కోరిక ఫలసాయములను కోల్పోయి యున్న వారికి తిరిగి సాగుచేసేందుకు కావలసిన ఎరువు విత్తనాలిచ్చి సహాయ్య పడటమేగాక వారికి ప్రస్తుతానికి కావలసిన ఆహారమునుకూడా సప్లయి చేయించుటకు ఏర్పాట్లు చేయుట అవసరమనిరి.

శ్రీ పసుమర్తి వీరభద్రస్వామిగారు ఆంధ్రజిల్లాలలో తుపానువల్ల కలిగినష్టము భీభత్సము ప్రభుత్వము తెలిపిన దానికంటె అతి దారుణముగా నున్నదనిరి. విశాఖ జిల్లాలో అసంఖ్యాకమైన ప్రజలు యిండ్లు భూములు సర్వస్వము కోల్పోయి ఘోరాతిఘోరమైన కష్టములకు పాలైయున్నారనియు వారికష్టాలను నివారించుటకు ప్రభుత్వము యితరజిల్లాల ప్రజలు ఔదార్యముతో సహాయ్యపడవలెనని విన్నవించిరి.

వి.కే. జాన్ గారు తుపానుదెబ్బతిన్నట్టి ఆంధ్రజిల్లాల ప్రజలకు సహాయ్యపడుటకు ప్రభుత్వము ఎక్కువధనమును గ్రాంటు చేసి వెంటనే ప్రజలకు సహాయ్యములభ్యమగునట్లు చూడటం అవసరమనిరి.

శ్రీ మోతే నారాయణరావుగారు ఆంధ్రజిల్లాలకు తుపానువల్ల కలిగినష్టము ఆంధ్రజిల్లా ప్రజలవరకుమాత్రమే నిలువదనియు ఆంధ్రజిల్లాలు యితరజిల్లాలకు ధాన్యంసప్లయిచేసే జిల్లాలైనందున వాటికి దెబ్బతగిలితే యితరజిల్లాలకుకూడ ఆహార సప్లయి లభించటం దుర్లభమగుననిరి.

అందుచేత తుపానుదెబ్బతగిలిన ఆంధ్ర జిల్లాలుత్వరలో కోలుకొనునట్లు చేయుటకు ప్రభుత్వము అత్యంత శ్రద్ధవహించడం చాలా ముఖ్యమనిరి.

ఆంతటితో సభ రేపటికోజు మధ్యాహ్నం 2-30 గంటలవరకు వాయిదాపడెను.

# వాన్‌కోవర్ (కెనడా) లో భారత ప్రధానమంత్రికి స్వాగతం.



ప్రధానామాత్యుడు పండిత నెహ్రూ, అమెరికా పర్యటనానంతరం లండన్ వచ్చినప్పటి దృశ్యం. ప్రక్కనున్న వారు ఇంగ్లాండులో మన హైకమిషనర్ వి. కె. కృష్ణమీనన్.



వన్‌కోవర్ మేయరు చార్లెస్ థామ్సన్ ప్రధానామాత్యునికి నగరస్వాతంత్ర్య చిహ్నమైన తాళపుచెవిని సగౌరవముగ సమర్పించుకొన్నప్పటి దృశ్యం.



వాన్‌కోవర్‌లోని క్లబ్బులవారు తన గౌరవార్థం ఏర్పాటుచేసినవిందులో ఉపన్యసిస్తున్న ప్రధానామాత్యుడు.



కామన్వెల్తు క్రికెట్ టీముకు, భారతీయ క్రికెట్‌టీముకూ 11 వ తేదీన జరిగిన మొదటి 'టెస్టు' ఆటకు హాజరైన సర్దార్ పటేల్ ప్రభృతులు.



ప్రధానామాత్యుడు పండిత జవహర్లాల్ నెహ్రూ వన్‌కోవర్ వచ్చినప్పుడు ఒక కారును ఈవిధంగా అలంకరించి ఊరేగింపుగా త్రిప్పారు.






ప్రఖ్యాత అమెరికన్ పత్రికా రచయిత వాల్టర్ లిప్‌మన్ ఇతడు ప్రస్తుతం మన దేశంలో వున్నాడు. వయస్సు 60 ఏండ్లు. 'టుడే అండ్ టుమారో' అనే శీర్షిక క్రింద ఇతడు వ్రాసే అంశాలను చదివేవారి సంఖ్య 80 లక్షలని అంచనా.



డా॥ చంద్రమౌళి, సత్యనారాయణగారు

తెనాలి పురపాలక సంఘ అధ్యక్షులుగ ఏకగ్రీవముగా ఎన్నుకోబడిరి







భీమవరంలోని ప్రకృతి ఆశ్రమానికి తుపానువల్ల కలిగిన నష్టం. రోగులకు వేసిన పాకలు పూర్తిగా పాడైపోయినవి.



బాధిత ప్రజానీకానికి సహాయము చేస్తూ పర్యటిస్తున్న "రక్షణదళం"



కొప్పెరువు గ్రామం పూర్తిగా విధ్వస్తమైపోయింది. ప్రజలు సహాయంకోసం ఎదురు తెన్నులు కాస్తున్నారు. వీరివెనుక "రక్షణదళ" సభ్యులు నిలబడివున్నారు.



అకివీడు ముస్లిముల పేట వరదనీరు వచ్చి పూర్తిగా నష్టమైనది. ఈ పేట మాదివాడ దగ్గరలో వున్నది.

## మద్రాసు నగరవిభజనం ఉత్తమ మార్గం

### "అధిపిల్లేకపోతేనే ప్రత్యేక రాష్ట్రంచెయ్యాలి"

అనంతశయనంగారి సూచన

బొంబాయి, నవంబరు 12: ఆంధ్ర, తమిళ రాష్ట్రాలు రెంటికీ మద్రాసు ఉమ్మడి రాజధానిగా వుండాలని, మద్రాసులో ఆంధ్ర ప్రాంతానికి, తమిళ ప్రాంతానికీ, కొత్త ఢిల్లీ, పాత ఢిల్లీలవలె వేర్వేరు మునిసిపాలిటీ లుండాలనీ శ్రీ అనంతశయనం అయ్యంగారు నేడిక్కడ చెప్పారు.

ఆయన ఇంకా ఇల్లా అన్నారు.

"ఆంధ్రరాష్ట్రానికి దక్షిణపు కొనలోను, తమిళనాడుకు ఉత్తరపు కొనలోను వున్న మద్రాసునగర సమస్యకు ఇంతకంటె మంచి పరిష్కారమార్గం లేదు. మద్రాసు ద్విభాషాయుత నగరం అవటంచేత దానిని విభజించటం చాలా సులభం.

ఒకవేళ ఈ సూచన అచరణ సాధ్యం కాదని తోస్తే మరొక్కటే మార్గంవుంది. మద్రాసు పెద్ద రేవుపట్టణాల్లో ఒకటి. రైల్వే గమ్యస్థానం కూడాను. అందుచేత జె. వి. పి. నివేదికలో బొంబాయిపట్ల సూచించబడినట్లే, మద్రాసును కూడా ప్రత్యేక రాష్ట్రంగా చెయ్యాలి. అయితే మొదటిమార్గానికి ఆంధ్రులు, తమిళులు ఒప్పుకోకపోతేనే, ఈ రెండోమార్గం అనుసరించాలి.

ఆంధ్రరాష్ట్రం రావటం నిశ్చయమైనట్లే. కొద్దిరోజులు మాత్రమే మనం వేచివుండాలి.

30ఏళ్లు ఆంధ్రులు ఆందోళన చెయ్యగా, చెయ్యగా ఇప్పటికి ఆంధ్ర రాష్ట్రం మద్రాసు రాష్ట్రంనుంచి వేరుచేయబడబోతున్నది. నూతన ఆంధ్ర రాష్ట్రంలో బళ్లారిజిల్లాలోని 8 తాలూకాలతో సహా 11 జిల్లాలు వుంటాయి. బళ్ళారిలోని 8 తాలూకాల విషయమై కర్నాటక రాష్ట్ర కాంగ్రెసువారు పేచీపెడుతున్నారు. ఈ పేచీ న్యాయంగా పరిష్కారం కాగలదని ఆశిస్తున్నాను.

ఆంధ్రరాష్ట్రాన్ని సాధ్యమైనంత శీఘ్రంగా నిర్మించటానికి చర్యలు తీసుకోవలసిందని కాంగ్రెసుకమిటీని నేను కోరుతున్నాను."

## కాళేశ్వర్రావుగారి ప్రకటన

విజయవాడ, నవంబరు 12: అయ్యదేవర కాళేశ్వరరావుగారు ఈ క్రింది ప్రకటన చేస్తున్నారు.

"విజయవాడలో నిన్న సమావేశమైన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘము ఆంధ్రకేసరి శ్రీ టి. ప్రకాశంగారి నాయకత్వాన, మార్గదర్శకత్వాన ఏకగ్రీవంగాను, అత్యుత్సాహంతోను చేసిన ఆంధ్రరాష్ట్ర తీర్మానం యావత్ దక్షిణభారతంలోను నిజమైన ప్రజాస్వామ్యమును తక్షణం స్థాపించటంలో అతి ప్రధానపాత్ర వహిస్తున్నది. రాష్ట్రపతి డా॥ పట్టాభి సీతారామయ్యగారు ఆంధ్రకాంగ్రెసువారికి సరియైన అదనులో సరియైన మార్గాన్ని సూచించటంతో, విభేదాలు లేకుండా ఈ తీర్మానాన్ని చెయ్యటం సాధ్యమైంది. ఈ తీర్మానం జె. వి. పి. రిపోర్టు ననుసరించి తక్షణ ఆంధ్రరాష్ట్ర నిర్మాణమును అంగీకరించటమే కాకుండా, మద్రాసు నగరము విషయమై కూడా న్యాయమైన, సహేతుకమైన పరిష్కారమార్గాన్ని సూచించింది. ప్రస్తుతం వున్నట్లుగానే, మద్రాసు నగరం దక్షిణ భారత ప్రజలందరికీ చెందిన ఉమ్మడి నగరంగా, ప్రత్యేక రాష్ట్రంగా చెయ్యబడాలని ఆతీర్మానం సూచించింది.

ఆంధ్ర, తమిళనాడు రాష్ట్రాల రాజధానులు కొంతకాలంవరకూ మద్రాసులోనే ఉండాలని తీర్మానించటం ద్వారా, తమ వాటి ఉభయరాజధానీ నగరాలు ఉభయ రాష్ట్ర మధ్యప్రదేశములలో స్థాపించుకోడానికి కావలసినంత సావకాశం లభిస్తున్నది.

మద్రాసు అందరికీ చెందిన నగరం కావటం వలన కేవలం తమిళ రాజధానికాని, ఆంధ్రరాజధానిగాని యివ్వగలిగిన పోషణ, ఆదరం సారస్వతానికీ, సంస్కృతికి యివ్వలేదు.

విజయవాడ తీర్మానంతో ఆంధ్రులు ఆంధ్రరాష్ట్రంతోపాటు కర్నాటక, కేరళరాష్ట్రాలు కూడా ఏర్పడటానికిమార్గం సూచించారు.

మలబారు జిల్లాగాని, దక్షిణ కనరా జిల్లాగాని, బళ్ళారిజిల్లా పశ్చిమ భాగంగాని తమిళనాడులో ఏమాత్రమూ వుండజాలవు.

ఇప్పుడు ఆంధ్రులమంతా కలిసి తెలంగాణాలోని 90 లక్షల ఆంధ్ర సోదరులు కూడా నూతన ఆంధ్రరాష్ట్రంలో వీలైనంత త్వరలో ఐక్యం కావటానికి చేయూతనివ్వటానికి సిద్ధంగా వున్నాను."

## శ్రీ కె. భాష్యం ప్రకటన

శ్రీ కె. భాష్యం యం. యల్. ఎ.

## ఇస్లాంమత ఆదర్శ, ఆశయాలు

### మసూదాలీగారి వివరణ

హిందూపురం, నవంబరు 3: "అహంకార అహంభావము లనెడి దుర్గుణముల నిర్మూలనమే ఇస్లాము. దానినుండియే విశ్వశాంతి ఉదయించగలదు. ఎవరీసిద్ధాంతమును అంగీకరించి తత్ప్రకారము నడచుకొందురో వారు ముస్లిములని పిలువబడుటకర్హులు. ఇస్లాముమతములో ఇతరమతములను దూషించుమనిగాని, ఇతరమతస్థులను హింసించుమనిగాని చెప్పియుండలేదు." అని దివ్యజ్ఞానసమాజసభ్యుడు మసూదాలీ నిన్న మొహరంసందర్భమున, ఇక్కడి ప్రాథమిక విద్యార్థశాలయములో జరిగిన సభలో ప్రసంగించారు. ఇస్లాముమతములోని సూత్రములను, సిద్ధాంతములను వివరిస్తూ, ఎవరిస్మారకచిహ్నముగ మొహరం జరుపబడుచున్నదో ఆ హాస్సేన్ హుస్సేన్ అనువారలు తమమతమునకై చేసిన ఆత్మబలినిగురించి మసూదాలీగారు మాట్లాడారు.

తరువాత ప్రధానోపాధ్యాయుడు యం. యల్. నరసింహంగారు మాట్లాడుచూ అన్నిమతభేదములను త్యజించి విశ్వమంతయు ఒకేమతముతో నిండియున్న దృశ్యమును మానవులు అవలంబించవలసిన ఆవశ్యకతనుగూర్చి చర్చించిరి. ఇప్పుడుప్రాథమికవిద్యావిధానములో అనుసరించుచున్న మహాత్మాగాంధీ సిద్ధాంతములవలెనే శాంతియుతమైన ఇట్టిమతము ఆవిర్భవించగలదని వారు ఉద్ఘాటించారు. దీనినుండియే స్వతంత్రులై స్వయంపోషకులై యున్న మానవుల కులమతభేదములులేని సంఘము ఉద్భవించగలదన్నారు.

విద్యార్థులు నాటక ప్రదర్శనము, మసూదాలీగారి హాస్యనటన జరిగెను.

## హిందూ-ముస్లిం సఖ్యత

మార్కాపురం, నవంబరు 5: ఈ పట్టణంలో మొహరం పండుగ చిలుకద్వాదశి తెప్ప ఉత్సవము ఒకరోజునసే తటస్థించుటవల్ల ప్రజలలో ఆందోళన బయలుదేరెను. కాని కొందరు ముస్లిం నాయకులు లిఖితపూర్వకముగా 4వ తేదీకి బదులు 3వ తేదిన వారిపండుగ జరిపెదమని హామీ యిచ్చినందున చిలుకద్వాదశి తెప్ప ఉత్సవము, 3వ తేది. మొహరం పండుగ యేలాంటి గలాటాలు లేకుండ ప్రశాంతముగ జరిగెను. స్వ. వి.

## నర్సాపురం సబ్ కలెక్టరుగారి బదిలీ

### రద్దుచేయాలని ప్రజాసంఘాల కోరిక

తణుకు, నవంబరు 10: నర్సాపురం డివిజన్ సబ్ కలెక్టరు యి. పి. రాయప్పగారిని మద్రాసు బదిలీ చేసినట్లు ఇటీవల ప్రకటితమైనది. ఆబదిలీని రద్దుచేసి రాయప్పగారిని నర్సాపురం డివిజన్‌లోనే ఖాయపరచవలసినదిగా తణుకు పట్టణ కాంగ్రెస్, పశ్చిమ గోదావరి జిల్లాకిసాన్ కాంగ్రెస్, హరిజన సంఘం మొదలయిన సంస్థలతరపున, నేడు టెలిగ్రాములు వెళ్ళినవి. వాటిలో రాయప్పగారి ప్రజాసేవను ముఖ్యంగా తుపాను బాధితులకు వారు చేస్తున్న సేవను ప్రశంసించారు.

## తిరుపతి దేవస్థాన జమీ రికార్డుల విక్రయం

తిరుపతి, నవంబరు 11: తిరుపతి దేవస్థానం కమిషనరు బి. వీరస్వామినాయుడుగారు గత రెండుదినములనుండి యీయూరియందు మకాము చేసియుండిరి.

1330 ఫసలీకి ముందుండినవియూ ఎస్టేటుకు సంబంధించినవియూ నగు అన్ని రికార్డులను చింపించి రాజమండ్రి ఆంధ్రపేపరు మిల్లుకును, డిస్ట్రిక్టుగజెట్లు వగైరా కాగితాల నట్టె బజారులలోను అమ్మివేయుటకును వీరు ఏర్పాట్లు చేసినారని తెలియుచున్నది. ఈ విధముగా తిరుపతి దేవస్థానముల జమీ యిలాకా అన్ని తాలూకాల

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు చేసిన తీర్మానము గ్రహించుటకట వీలు లేనిదిగనూ, ఉచ్ఛితమునకు దారితీయునదిగనూ వున్నదనిరి. మదరాసు విషయమై ఆంధ్రులు ఆంధ్రేతరుల మధ్య వివాదమును అంతము చేయుటయే జె. వి. పి. నివేదిక అంతరార్థము. అయితే ఈ తీర్మానము తగాదాను అట్లాగే వుంచినది. జె. వి. పి. నివేదికను అంగీకరించుచున్నట్లు కనిపిస్తూ ఆం. రా. కాం. సంఘము ఆంధ్రులు నగరముమీద హక్కు వున్నదనుటకు అవకాశం వుంచుకొనుచు తీరా నించి యున్నది ఇది సహించరానిది ఈ తత్వమును తిల ఎత్తివేయగూడదు. మదరాసు ప్రభుత్వము ఈ నిరాధార హక్కులకు తి జవాబు చెప్పెదరని ఆశించుచున్నాను. విడిపోవటానికి సిద్ధపడ్డప్పుడు పూర్తిగ తెగతెంపులు చేసుకోవలెను. ఒకే నగరములో రెండు రాజధానులు వుండుటవలన అనేక చిక్కులు రాగలవు. నగర పరిపాలన క్లిష్టము గందరగోళము అవుతుంది. కాబట్టి తాత్కాలికముగా కూడ ఆంధ్ర రాజధాని నగరములో వుండుటకు వీలులేదనిరి.

ను చేయుచున్నట్లును, తెలిసినది. ఈ ఫసలీగా చేయబడిన అమూల్యములైన ప్రాతరికార్డులనేకములు నాశనమగునేమోనని భావించడమవుచున్నది. (స్వ. వి.)

## ఎరువుల సప్లయి

### పుత్తూరు తా॥ ఆహారసంఘ తీర్మానం

నగరి, నవంబరు 10: పుత్తూరుతాలూకా ఆహారసంఘ సమావేశము నిన్న చంద్రగిరి రివిన్యూ డివిజనల్ ఆఫీసరు శివసుబ్రహ్మణ్యంగారి అధ్యక్షతను జరిగెను.

ఈ తాలూకాలో రైతులకు సగం వెలకు ఇచ్చుచుండిన సూపర్‌ఫాస్ఫేటు, అమోనియంఫాస్ఫేటు ఎరువులను యిక మీదట అప్పు ఇచ్చుటకు వీలులేదని, అధ్యక్షుడు తెచ్చిన ప్రతిపాదనను ఆమోదిస్తూ, ప్రస్తుతం తాలూకాలో నిలవవున్న ఎరువులను ఇదివరకుమాదిరిగానే యిప్పించవలసిందని ప్రభుత్వమును కోరుతూనూ, తాలూకాలో ప్రస్తుతం నిలవవున్న 19 బస్తాల చక్కెరను తాలూకాలోని అన్ని గ్రామాలలోని రేషన్ దుకాణాలకు సరఫరాచేసి అందరికి లభ్యమయ్యే పద్ధతిలో పంచిపెట్టవలెననీ, దుకాణాలులేని గ్రామాలలో అట్టి దుకాణాలు పెట్టించుటకును తీర్మానించిరి.

## ఒంగోలు తాలూకా తంతి తపాలా కార్మికసంఘం

ఒంగోలు, నవంబరు 7: ఒంగోలు తాలూకా తంతితపాలా పనివారల సంఘముయొక్క సర్వసభ్య సమావేశము ఈ నెల 5వ తేది సాయంకాలము, సంఘాధ్యక్షులు శ్రీ యస్ సీతారామయ్య నాయుడుగారి అధ్యక్షతక్రింద జరిగెను. అన్ని ప్రాంతాలనుండి సభ్యులరుదెంచిరి. అధ్యక్షులు, పనివారలలో ఐకమత్యమును గురించి మాట్లాడిరి. కార్యదర్శి శ్రీ సున్నం సీతారామశర్మగారు, ట్రేడ్ యూనియనిజము, రాజకీయములకు గల సంబంధమును గురించి యుపన్యసించుచూ, ప్రతి తపాలా కార్మికుడు తన హక్కులు కాపాడుకొనవలె ననిరి.

### తీర్మానములు

జీవితావసర వస్తువులకు ధరలు తగ్గనందున, కేంద్రసంఘమువారు చేసిన సిఫార్సుల ప్రకారము, కరువు భత్యములు హెచ్చించవలెనని లోయర్ సెలెక్షన్ గ్రేడ్ సబ్ పోస్టుమాస్టర్లకు, వారి హెచ్చుబాధ్యతల దృష్ట్యా బేసిక్ జీతము రు. 160/- నుండి రు. 200/- లకు హెచ్చించవలెననియు, ఇంత్రా కొరతను గమనించి, అందరు నాన్‌గజెటెడ్ వుద్యోగులకు నెలకు రు. 10/- యింటి అద్దె యివ్వవలెననియు, బ్రాంచి ఆఫీసులలో నున్న వుద్యోగుల నందరిని డిపార్టుమెంటులో చేర్చుకొనియు, ఆంధ్రరాష్ట్ర పోస్టల్ సంఘమును, త్వరలో గుర్తించవలెననియు తీర్మానములు చేసిరి. ఇక్కడ పోస్టుమాస్టరుగా పనిచేయుచున్న జనాబ్ యం. ఎ. పోలార్ సాహెబుగారు నెల్లూరుకి మార్చబడిన సందర్భములో, వారికి, అల్పాహారవిందు, వీడ్కోలు ఇచ్చిరి.

కార్యదర్శి, శ్రీ యం. సీతారామయ్యగారి అభివందనములతో సభ ముగిసెను.

## పళ్లిపట్టు తా॥ యువజన కాంగ్రెస్ కార్యవర్గ ఎన్నికలు

నగరి, నవం 9:—పళ్లిపట్టు తాలూకా యువజన కాంగ్రెసు సర్వసభ్య సమావేశము 6వ తేదీన టి. బంగారుశెట్టి గారి అధ్యక్షతను జరిగినది.

ఎమ్. సుబ్రహ్మణ్యంరాజు, అధ్యక్షులుగ, టి. బంగారుశెట్టి ఉపాధ్యక్షుడుగ, ఎ. ఆర్. దేవరాజులు కార్యదర్శిగ, సి. వెంగారెడ్డి సహాయకార్యదర్శిగ, తాత్కాలికముగా ఎన్నుకోబడిరి.

శ్రీ కృష్ణమనాయుడు (ఉప్పరపల్లె), జి. నల్లమనాయుడు (క్షీరసముద్రం), వరదారెడ్డి (పిల్లారికుప్పం), ఏకాంబర రెడ్డి (నలిగరం), వెంకటరెడ్డి (కొళ్లాపట), సుబ్బయ్య (పిల్లారికుప్పం), జి. నరసింహులు (పళ్లిపట్టు), పింగోపాలు నాయుడు (కరింబేడు), పి. రామస్వామి నాయుడు (పుణ్యం), గోవిందరాజులు నాయుడు (అత్తిమాంజేరిపేట), పి. పార్థసారథిశెట్టి (పళ్లిపట్టు) కార్యవర్గసభ్యులుగ ఎన్నిక అయిరి.

అనంతరం ఈ తాలూకాలో ధాన్యం శిస్తుల విషయములో ప్రభుత్వము వద్దకు రాయబారం వెళ్లుటకున్నూ, తాలూకా యువజన మహాసభను త్వరలో ఏర్పాటు చేయుటకున్నూ, ఆసందర్భంలో తాలూకా జమీందారీ రైతు మహాజన సభను జరుపుటకు తగు ఏర్పాటును చేయుటకున్నూ ఈ సంఘమునకు ప్రతిగ్రామంలోను యువజనులను సభ్యులుగా చేర్పించుటకు పి. పార్థసారథి శెట్టి, ఎ. ఆర్. దేవరాజులు శ్రీ వరదారెడ్డి, పి. రామస్వామిరెడ్డిగార్లతో ఉపసంఘము నేర్పరిచిరి.

## కడపజిల్లాలో 4 గురు కమ్యూనిస్టుల అరెస్టు

నంద్యాల, నవంబరు 12: కడపజిల్లా పెద్దపసుపుల గ్రామమున యీమధ్య జరిగిన పోలీసు కాల్పులకును, ఆగ్రామమున సబు హత్యకు సంబంధించిన వెంకటరెడ్డి, చిన్న కొండారెడ్డి, పెద్ద కొండారెడ్డి, సోమిరెడ్డి అను నల్గురు కమ్యూనిస్టులు యీజిల్లా చిన్నవంగలి గ్రామ సమీపపు అడవులందు దాగియుంటున్నారను సమాచారము తెలిసి కోయిలకుంట్ల పోలీసు సర్కిల్ యిన్స్పెక్టరు శ్రీ టి. జె. పాలమునుగారును, చాగలమర్రి స్టేషన్ సబ్ యిన్స్పెక్టరు శ్రీ జి. రామకృష్ణప్పగారును, తమపోలీసు సిబ్బందితో ఆప్రాంతమును శుక్రవారం తెల్లవారుజామున దాడిచేసి, వారిని అరెస్టు చేసిరి. అరెస్టు చేయుసమయమున వారి చెంతనున్న మూడు బల్లెములను, ఒక బాకును పోలీసువారు స్వాధీనపరచుకొనిరి. అరెస్టు చేయబడిన పైనల్గురు అళ్లగడ్డ సబ్ జైలులో రిమాండునందుంచబడియున్నారు. స్వ. వి.

## పొన్నూరు ఆలయ శిఖర పునఃప్రతిష్ఠ

పొన్నూరు, నవంబరు 8: స్థానిక శ్రీ భావనారాయణ స్వామివారి ఆలయ శిఖర పునఃప్రతిష్ఠ మొన్న జరిగింది. దేవాలయ ధర్మకర్త నాశిరెడ్డి హరహరప్రసాద్ బహదూరు, మస్తాన్ సుల్తానుగారు, మేనేజరు కె. ఎ. వి. చౌదరిగారు పాల్గొన్నారు.

ఈ దేవాలయ శిఖరం పోయి సుమారు 7 సంవత్సరాలు అయింది.

ఇటీవల యీ దేవాలయంలో దొంగలు పడి "అమ్మవారి" పుస్తె పూసవగైరాలు తెంచుకు పోయినారు. ఇంకా మంగళ సూత్రధారణ జరుగలేదు.









Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No. 7, Thambu Chetty Street, G. T. Madras.